శ్రీరస్తు.

# శివలీలావిలాసము.

కూచిమంచి తిమ్మకవికృతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1921

శ్రీరస్తు.

# శివలీలావిలాసము.

---

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాప్రార్థనము.



నగజాఘనస్తనవిస్ఫురత్స్వరసంకుమద్రైణాంకాభిపం
కానికవాసితస్ఫుటభుజాంతరుఁ డిందుసుధాపయస్సదృ
గ్భానుతికీర్తిపీఠపురకుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలనపరాయణుఁ డీవుత మా కభీష్టముల్. 1

క. మగనిసగమేన నెలకొని, ముగురంబలయందు నాదమూలం బగుచున్
జగమేలుసర్వమంగళ, జగమే లిడుఁగాత మాకు సమ్యక్కరుణన్. 2

ఉ. శ్రీరమణీరమేశ్వరులఁ జిత్తమునం గదియించి భారతీ
సారసగర్భుల న్మిగుల సంస్తుతిఁ జేసి మతంగజాననున్
సారెకుఁ గొల్చి చెందులురిసత్కులపావను లింగనార్యు నిం
పారఁ దలంచి మున్నిటిమహాకవుల న్భజియించి వేడుకన్. 3

### కవివంశాభివర్ణనము.

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతుండఁ గూచిమంచ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రిశేఖరునకు నంగనామణి యగులచ్చమాంబకును సుతుఁడ
బహుకావ్యనిర్మాణబంధురప్రతిభుండఁ గుక్కుటేశ్వరకృపాకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌరేయుఁడ బుధజనప్రియచరితుఁడ

తే. చెందులూరిలింగనారాధ్యదేశికేంద్ర, దత్తమాహేశ్వరాచార్యవృత్తిరతుఁడఁ
గందరాడకునగ్రామమందిరుండఁ, దిమ్మకవిచంద్రుఁ డనుజగద్వినుతయశుఁడ. 4

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును నచ్చతెనుంగురామాయణంబు

సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహమును సర్వపురస
తే. మంచితక్షేత్రకథనంబు మఱియుఁ జెక్కు, శతకదండకసత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యుల్ల మలరారఁ బార్వతీవల్లభునకు, భక్తి నర్పణఁ జేసినభవ్యమతిని. 5

వ. ఇట్టి నేను మదభీష్టదైవతం బైన కుక్కుటేశ్వర శ్రీమన్మహాదేవునకు నంకితంబుగా మఱియు నొక్క ప్రబంధంబు రచింపం దొడంగి. 6

## షష్ఠ్యంతములు.

క. సర్గాపసర్గఫలదని, సద్గునకున్ దుర్గునకుఁ బ్రశమితమహాంహో
వర్గునకు నూరినుతస, న్మార్గునకు మనోజ్ఞసానుమద్గిరునకున్. 7
క. అంభోజాసనముదసం, స్తంభునకున్ శంభునకు నుదంచితకరుణా
రంభున కఖిలావనసం, రంభునకున్ ముదితమానిరాడ్డింభునకున్. 8
క. సర్వసుపర్వకదంబక, పూర్వునకున్ శర్వునకును భుజబలలీలా
ఖర్వునకు శమితయమరా, డ్గర్వునకు మహోక్షరాజగంధర్వునకున్. 9
క. బాణాదిభక్తజనసం, త్రాణునకున్ స్థాణునకు నుదంచదుదన్వ
త్తూణునకు సరసిజేక్షణ, బాణునకున్ సత్యవాక్యపరిమాణునకున్. 10
క. సామజదానవదర్పవి, రామునకున్ సోమునకును రజతమహీభృ
ద్ధామునకుఁ గోటిదినకర, ధామునకు మహోగ్రసమరతలభీమునకున్. 11
క. పురదైతేయస్మరసం, హరునకు హరునకు నిరంతరాత్యంతదయా
పరునకుఁ బీఠాపురమం, దిరునకు శ్రీకుక్కుటేశదేవవరునకున్. 12

వ. సమర్పణంబుగా నారచియింపం బూనినశివలీలావిలాసం బనుశృంగారరసప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన. 13

## కథాప్రారంభము.

గీ. హస్తిపురమున నొక్కనాఁ డర్జునుండు, భీష్ముఁ గన్గొని మ్రొక్కి సంప్రీతిఁ బలికెఁ
దాత నిన్నొక్కపుణ్యకథాప్రసంగ, మడుగఁ గోరెదఁ గృపతోడ నాన తిమ్ము.
క. నీ వెఱుఁగనిపుణ్యకథల్, భూవలయమునందు లేవుగద యేమైనన్
భావింపఁగ నఖిలజగ, త్పావని యగుగంగమహిమఁ బ్రతిభం జెప్రుమా. 15
ఆ. శివుఁడు గంగ నేల శిరమున నిడుకొనె, గంగ విష్ణుపాదకమలమున జ
నించు టెట్లు తాత నిక్కంబుగా నిది, తేటపడఁగ నాకుఁ దెలుపవలయు. 16
వ. అదియునుం గాక. 17

గీ. గంగఁ గొందఱు జాలరికన్నె యనుచు, నెన్నుచుండుదు రమ్మాట యేర్పడంగ
వినఁ దలంచెద నమ్మహావేణి కీవు, కూర్మిపట్టివి గద యసద్గుణకలాప. 18

గీ. అనిన గాంగేయుఁ డప్పాండుతనయుఁ బలికె, వత్స నే మున్ను నారదువలన విన్న
తెఱఁగు నీకిప్పు డెలమితో నెఱుఁగఁ జేతు, నింపు దైవార విను మని యిట్టులనియె.

ఆ. మొదలఁ గమలగర్భుఁ డుదకంబుల సృజించి, వీర్య మందులోన విడిచె నది స
హస్రకరనిధిప్రభాంచిత మై హైర, ణ్యగర్భరూప మైనయండ మయ్యె. 20

వ. ఆయ్యండంబునందుఁ జరాచరాత్మకం బైనసకలప్రపంచంబు సృజియించి వృద్ధిఁ
బొందింపుచుండె నంత. 21

గీ మాపకాసురుఁ డనుసురద్వేషి యొకఁడు, ధాత్రియయ్యండమున కొకతూటు పొడిచె
నందువలన మహోదకం బద్భుతంబు, మీఁదఁ బెనువెల్లి యై వచ్చి పాఱుచుండె.

క. ఆవెల్లి జగము లన్నియు, వేవేగ న్ముంచి జంతువితతికి నెల్లన్
వావిరి నుపద్రవంబుం, గావింపుచు నున్న నీలకంఠుఁడు పేర్మిన్. 23

గీ. జగదుపద్రవశాంతికై నెగిలి మున్ను, కాలకూటంబుఁ గంఠభాగమున నిల్పి
చందమున నమ్మహాంబునిర్ఝరము నెలమిఁ, దనజటాజూటవీథి నందముగఁ దాల్చె.

గీ. అపుడు గంగ మహేశుజటాగ్రవీథిఁ, బట్టఁజాలక యుప్పొంగి పైకిఁ బొరలి
ఘనతరంగిణి యై దూఁటి కమలజాండ, మవలనుండ శాంభవలోకముప నదనము గాఁగ.

గీ. హరియు నయ్యెడ మాపకాసురు వధించి
తనపదాంగుష్ఠ మబ్బిలద్వారసరణి
నునిచి నీరాఁగె సందున నుండి యూఁట
యించు కాలోపలికిఁ బ్రవహింపుచుండె. 26

వ. ఆప్రవాహంబు సకలభువనంబులఁ బవిత్రంబుగా గంగాభవాని యేకార్ణవంబుగ జగంబు లన్నియు ముంచి లోజంతుకోటిజలచరంబులక్రియ మించి
చెలంగి పొంగి. 27

క. తనకాదు లెవ్వరు లే రని, మునుకొని గర్వాతిరేకమునఁ బలికినన
వ్వనితారత్నము గనుఁగొని, కినుక మదిం బెనఁగొనంగ గిరిశుఁడు పలికెన్. 28

గీ. అంబుదానవు నీ కిట్టు లబ్బురంపు, గర్వ మేటికి నాచేతఁ గమలసంభ
వాదులును మున్ను గర్వించి యడఁగి చనిరి, గర్వ మెంతటివారికిఁ గాదు సుమ్ము.

క. భూచక్రంబున కిప్పుడె, వే చని నీ వందు మర్త్యవిక్రయవృత్తిన్
బ్రాచుర్యంబుగ మనియెదు, నీచకులంబున జనించి నిలువుము చెలియా. 30

గీ. అనిన నలుకొంది గంగ యోయనఘచరిత, తప్పు సేసితి లొంగి నీదయ దలిర్పఁ
గాచి రక్షించు మన్నదఁ గాఁక యుడఁగ, నిన్ను నెడఁబాసి క్షణమైన నిలువఁజాల.

క. నావుడు శంకరుఁ డిట్లను, నీ వటువలెఁ గొన్నినాళ్లు నిలిచినపిదపన్
దేవత లెన్నఁగ నిన్నున్, దేవిగఁ బెండ్లియాడి తెచ్చెద మరలన్. 32

వ. అని పరమేశ్వరుం డానతిచ్చిన నట్లనె గంగాభవాని దాసకులకన్యాస్వరూపంబు ధరియించి భూలోకంబునకు వచ్చి పారావారతీరంబున మహేశ్వరుం గురించి తపం బాచరింపుచుండె నంత. 33

సీ. శంఖుదేవుం డనుజాలరిగేస్తుండు దనబంధువుల దానుఁ దవిలి యొక్క-
నాఁడు దా నేలూరినగరంబునందుండి జలధికి వేఁటాడఁ జని యొకయెడఁ
దపముసేయుచు నున్నతరళాయతేక్షణఁ జిన్నికన్నియఁ జూచి చేరఁబోయి
తల్లి నీ వెవ్వరిదానవు కుల మెద్ది తల్లిదండ్రు లెవ్వారు కులము పేరు
గీ. నద్దితప మేలచేసెద విచట నిట్లు, సరసిజానన నాకు నీచందమెల్లఁ
దెలియఁజెప్పు మటన్న నక్కలికిమిన్న, యింపు దళుకొత్త నతనికి నిట్టు లనియె.

గీ. తండ్రి విను మేను గంగను దక్షహారుఁడు
నన్ను నొకకారణమున డెందంబులోన
నలిగి జాలారికన్నియ వై జనించు
మని శపించిన వచ్చి యిట్లైతి జమ్ము. 35

గీ. తల్లి యిట్లున్న నినుఁ గంటిఁ దండ్రి నైన, నీవె కూఁ రింక నన్యుల నేనెఱుంగ
నెవ్విధంబున సాఁకెదో హితముతోడ, ననినముద మంది యతఁ డిట్టు లనుచు బలికె.

గీ. అమ్మ నీ వేమిగోరిన నట్ల సేతుఁ, గలవు మాయింట సకలభాగ్యంబు లిపుడు
రమ్ము నాతోడ మాభవనమ్మునకును, జీవనప్రాయముగఁ జూతుఁ దెలియ నిన్ను. 37

క. రావమ్మ భువనపావని, రావే నాముద్దుబిడ్డ రావె లతాంగీ
రావే శుభఫలదాయిని, రావే జగదంబ యిపుడె రా నాతోడన్. 38

వ. అని యపుత్రకుండు గావునఁ బెన్నిధానంబు గన్నపేదచందంబున దైవంబు నా కిప్పు డిబ్బాలారత్నంబు నొసంగె నని పొంగి దానిం దోడ్కొని నిజగృహంబున కరిగి తనభార్య యగుచక్రమదేవి కప్పగ నొసంగిన నవ్వధూరత్నంబు. 39

ఆ. పెరుఁగుఁ బాలు జున్నుఁ బెల్లంబు నెయ్యి కొబ్బరి యనంటిపండ్లు పనసపండ్లు
పిండివంట లిక్షుఖండంబు లోరంబు, ప్రీతి యొసఁగ నొసఁగి పెనుచుచుండె. 40

వ. అట్లు పెనుచుచున్నయెడ. 4

ఉ. అంగదముద్రికావలయహారలలాటిక లెమ్మెసొమ్మెయి
వ్రంగులు గుల్కఁ గ్రొందగటునాడెపుఁబాపడసొంపు నింప మే

ల్బంగరుగిల్కుటందియలు బాలిక నంఘ్రుల ఘల్లుఘల్లనన్
గంగ యనుంగులం గలసి కౌతుకలీలలఁ గ్రీడసేయుచున్. 42

సీ. బొమ్మపెండ్లిండ్లు సొంపుగఁ జేసి కుజ్జగూటియామెత లనుంగులకుఁ బెట్టు
బలితంపుటపరంజిపంజరంబుల నిడి చిలుకబోంట్లకు మేఁత లెలమి నొసఁగు
నాడెంపునెలతాలమేడలపై నిల్చి లీల నైమై తూఁగుటుయ్యాల నూఁగుఁ
బరువంపునెత్తావివిరిబొండుమల్లెలం జాజులచిత్తి బ్రోదిసేయు
గీ. బోటులను గూడి కిన్నరమీటు నింపు, పాటుకొలుపుచు జిలిబిలిపాట పాడు
హాళి దైవారఁ జెంగల్వకేళికుఁజుల, నోలలాడుఁ జెలంగి యవ్వాలుగంటి. 43

వ. అట్లు క్రీడింపుచు దినదినప్రవర్ధమాన యగుచున్నంత. 44

సీ. నిద్దంపుసోగవెన్నెరులు వేనలికంటె నెదఁ జన్నిచన్నులు కుదురుకొత్తెఁ
గనుదోయి నరసిగ్గుకలికిచూపు లెసంగె నూనూఁగునూఁగారు గానవచ్చెఁ
దావిమోవికిఁ గ్రొత్తతలిరుడాలు ఘటిల్లె జిలిబిలిపలుకుల మొలచె దీప్తి
నెమ్మొగంబున వింత నిగనిగ జిగిపొల్చెఁ జిన్నారినగవులు చెంగలించె
గీ. నడలఁ గడ లేనివయ్యారి పెంపు గడలుకొనియె, మెఱుఁగు చెక్కుల తళతళల్ దుఱఁగలించెఁ
గటిభరం బించుకించుక ఘనతఁ దాల్చెఁ, జెలికి లేజవ్వనము మేన మొలుచుటయును.

వ. అట్టి నవయౌవనారంభంబునఁ జీనిచీనాంబరానర్ఘమణివిభూషణసుగంధతాంబూలాదికంబులం దేజరిల్లుచుండె నంత. 46

సీ. నిరులకు మన్కి యై చిరసుఖాకరమైన కైలాసశైలశృంగంబునందు
మహనీయతపనీయమయసముద్దీప్తనీలాకాంతమాణిక్యసౌధవీథి
నలువయు వెన్నుండు బలరిపుప్రముఖదిక్పతులును సనకాదియతివరులును
నందీశగుహగజాననభృంగిరిటివీరభద్రభైరవముఖప్రమథపతులుం
గీ. దవిలి కొలువంగ గిరిరాజతనయఁ గూడి, యనుపమానర్ఘరత్నసింహాసనమున
నక్కజం బగుఠీవినై నొక్కనాఁడు, హాళిఁ గొలువుండె రాజరేఖార్ధమౌళి. 47

వ. అయ్యవసరంబున. 48

సీ. మినువాకతెలినీరు నినిచినకుండికఁ బసిఁడిచాయలఁ గేరుపల్లజడలు
వెన్నెలనిగ్గును నెదచల్లునెమ్మేను చక్కనిస్ఫటికంపుజపసరంబు
గాలిసోఁకిన మ్రోయుకడిఁదికిన్నరవీణె యభినవమృదులకృష్ణాజినంబు
దట్టంపుగోపిచందనపుంద్రవల్లికల్ పసమించుకాషాయవసనములును
గీ. గలిగి భవభర్గ చంద్రశేఖర మహేశ, హర మహాదేవ సాంబ శంకర గిరీశ
యనుచు వేడుక నచ్చోటికరుగుదెంచె, సారవిద్యావిదుం డైననారదుండు. 49

గీ. అట్లరుగుదెంచి దివిజసంయమివరుండు, భక్తి దైవార నమ్మహాప్రభునినగరు
సొచ్చి హెచ్చినవేడుక నచ్చుపడఁగఁ, గేలుగవమోడ్చి యద్దేవుమ్రోల నిలిచి. 50

సీ. రాకేందునీకాశరమ్యగాత్రమువాని రమణీయఫణిభూషణములవానిఁ
గందర్పశతకోటిసుందరాకృతివాని డమరుత్రిశూలఖడ్గములవాని
సదమలదరహాసరసాననమువాని భసితాంగరాగవిభ్రమమువాని
సింధురాజినసమంచితనిచోళమువానిఁ గరుణాకటాక్షవీక్షణమువానిఁ

గీ. ప్రథితభువనోద్భుతోరువైభవమువాని, ఘనతరానందహృదయపంకజమువాని
సకలలోకాధిపతి యైనసాంబశివునిఁ, గనియె మునిమౌళి కన్నులకఱవుదీఱ. 51

క. అటువలెఁ బొడఁగని కేల్గవ, నిటలస్థలిఁ జేర్చి సంజనితకౌతుకవి
స్ఫుటదంతరంగుఁ డై య, జ్జటికులవల్లభుఁడు వాక్యచాతురి మెఱయన్. 52

సీ. భసితాంగరాగాయ భక్తానురాగాయ ఫాలేక్షణాయ తుభ్యం నమోస్తు
భర్మాద్రిచాపాయ భద్రేంద్రవాహాయ భయవిదూరాయ తుభ్యం నమోస్తు
భండనోద్దండాయ భానుప్రతాపాయ భవ్యరూపాయ తుభ్యం నమోస్తు
భరతప్రవీణాయ భవనాయితనగాయ భద్రప్రదాయ తుభ్యం నమోస్తు

గీ. భావభవసంహారాయ తుభ్యం నమోస్తు, భవసరన్నావికాయ తుభ్యం నమోస్తు
భద్రచర్మాంబరాయ తుభ్యం నమోస్తు, భారతీశార్చితాయ తుభ్యం నమోస్తు. 53

వ. అని నమస్కరించి వెండియును. 54

సీ. జయజయ కైలాసశైలనికేతన జయజయ దేవతాసార్వభౌమ
జయజయ గిరితనూజామనోంబుజభృంగ జయజయ దైవవేశ్యాభుజంగ
జయజయ నిగమాంతసముదయసంవేద్య జయజయ భువనరక్షాధురీణ
జయజయ జలజాతసంభవాండపిచండ జయజయ శాశ్వతైశ్వర్యధుర్య

గీ. జయపురందరహరివిరించనముఖాఖి, లామరస్తోమమకుటాంచలాంచితాబ్జ
రాగమాణిక్యరోచిర్విరాజమాన, చరణపంకేరుహోద్దేశ జయమహేశ. 55

క. పరమేశ నిన్నుఁ బొగడఁగఁ, దరమే శేషునకు హరిపితామహబలసం
హారులకు సనకాదిమునీ, శ్వరులకు నొక్కింతయైన వర్ణింపంగన్. 56

సీ. మహిమ మీఱఁగ సర్వమంత్రరాజం బైనగాయత్రి కీవెపో నాయకుఁడవు
శ్రుతు 'లేకయేవరుద్రోనద్వితీయ' యంచనిశంబు నిన్నె కా వినుతి సేయుఁ
బ్రత్యహంబును 'శివాత్పరతరంనాస్తి' యంచలర స్మృతుల్ నిన్నె తెలుపుచుండుఁ
బురుషోత్తమఖ్యాతిఁ బరఁగువెన్నుఁడు వేయి రాజీవముల నిన్నె పూజసేయు

గీ. జలజగర్భుండు మొదలుగు జంతువులకుఁ, బతి వగుటఁజేసి నీకె విశ్రుతము గాఁగఁ
పశుపతిసమాఖ్య చెల్లె నబ్బురము మీఱ, నిన్నుఁ గొనియాడ నెవ్వరు నేర్తు రభవ.

మ. శరికిన్ మర్కటకీటపోతమునకుం గాలాహికిన్ మాలపో
టరికిం జెంచుకొలంపు బత్తునకు వేశ్యాస్తోత్రసామ్రాజ్యసు
స్థిరసౌఖ్యం బొనఁగూర్చి ప్రోచినకృపాసింధుండ వాహాభళీ
సరియే యీహరికిట్టివేల్పుదొర లెంచ న్నీకు శ్రీకంధరా. 58

గీ. శ్వేతుఁడు మృకండుతనూనుండుఁ జేరితాను
చేరఁ గడలేనియిడుములఁ జిక్కి పొక్కి
నిన్ను శరణన్న జముఁ బడఁదన్ని వారి
కెన్నటికిఁ జావు లేకుండ నిడితి వభవ. 59

క. హరి తననయనాబ్జములోఁ, దొరలఁగ నొకవేయివిరులతోయజముల నీ
శిరమునఁ బూజించినఁ గని, యిరువుగ నాతనికిఁ జక్ర మిచ్చితివి గదా. 60

క. సురదనుజా లబ్ధిఁ దరువగ, గరళము ప్రభవించి జగము గాల్పఁగ దానిన్
సరగున గళమున నిడుకొని, పరిపాలించితివి గద ప్రపంచంబు శివా. 61

గీ. భైరవాకృతియును వీరభద్రమూర్తి, శరభసాళ్వరూపంబు సరవిఁ దాల్చి
నలినభవదక్ష నారసింహులశిరంబు, లేపుమీఱంగఁ దునుమవె యీశ నీవు. 62

సీ. గడితంపుటపరంజికట్టునింగిణివిల్లు గాలిబోనపుఁదిండికోఁడుం వారి
యీరేనమేనుల నేవుచూపులకోరి యార్వాఁడుతునియులై యెలరు వరద
మిరుదుగ మొనగయుందొర తేనుపూన్పతి పగటివేలుపు నెలబండికండ్లు
ప్రాఁబల్కుటీటుములు బలవారువంబులు తెరగట్టుమన్నియ తెగలుబండ్లు
గీ. గాఁగ దిగప్రోల్లుబలితంపుఁగడిమిఁ గూల్చి, జగము నావడి యుడిపి నిశ్శంక నలరు
నీప్రభావంబు బుధులు వర్ణింపఁ గలరె, భానుశతకోటిసంకాశ పార్వతీశ. 63

సీ. పులికరాసంబును బూదిగంధంబును బుటేలుకంచంబును బునుకుపేర్లు
చిలువతాసొమ్ములు చికిలిముమ్మొనవాలు కంకటికోడలేజింకకూన
పలుకుటందియులు చౌవంచనెమ్మొగములు మెట్టబిడారంబు వెట్టకన్ను
చేతిపుత్తుక యాలపోతుటెక్కెంబును గ్రొన్నెలతలపువ్వు విన్నదూరము
గలిగి వెలుఁగొందు నీమూర్తిఁ దలఁపునందు, నిలిపి యేప్రొద్దుఁ గొలుతు నన్నేలుమిఁ బ్రోవు
శత్రుబలభీమ దేవతాసార్వభౌమ, గిరిసుతానాథ నిఖలనిర్జరసనాథ. 64

గీ. వేయినోళ్లను మఱి రెండువేలనాల, కలుగు శేషునకైనను నలుమొగముల
ప్రోడకైనను దరమె నిన్నొగడ నింక, వేయునేటికి నన్నుఁ బ్రోవు విశ్వజనక. 65

గీ. అని నుతించుమునీంద్రుఁ గన్గొని శివుండు
సారకరుణామృతార్ద్రసుస్వాంతుఁ డగుచు
నుచితపీఠాంతరమునఁ గూర్చుండఁజేసి
కుశల మడిగి యతిమధురోక్తు లవచించె. 66

క. మునివర సకలజగంబులు, ననివారణముగ జరింతు వచట నచట నీ
కనుఁగొన్న వింత లెల్లను, వినుపింపుము మాకు జెప్ప విస్తరిలంగన్. 67

క. ఏయేజగములఁ జూచితి, వేయేదేశములు గంటి వేయేపురముల్
పాయక పొడఁగాంచితి విభు, డాయెడలం గలుగువార్త లచ్చుగఁ జెపుమా. 68

గీ. అనిన నారదుం డిట్లను నధిప సకల, భువనములఁ జూచుకొనుచు నేఁ బోయిపోయి
నవకుతూహలమహితమానసుఁడ నగుచు, భూతలమ్మున నేలూరిపురముఁ గంటి. 69

సీ. బహురత్నవిరచితప్రాసాదములచేత రమణీయమణిగోపురములచేత
నిందిరాకరదివ్యమందిరంబులచేత సుకరకపోతపాలికలచేతఁ
దపనీయమయదేవతాధామములచేతఁ బటువజ్రసోపానపటలిచేత
భక్తశైలోన్నతప్రాకారములచేత దివిజేంద్రశిలవేదికలచేత
గీ. విమలపద్మాకరోద్యానసమితిచేత, గంధగజరాజధేనుసంఘములచేత
ధరణిసురముఖ్యసజ్జనోత్తములచేత, భవ్యగతిఁ బొల్చు నేలూరిపట్టణంబు. 70

చ. అసమశరోపమానసముదంచితవిగ్రహుఁ గంటి నందుఁ గ్రొ
మ్మిసిమికడానిబంగరపుమించులమించుపిసాళిమేనిరుల్
రసికమనోంబుజంబులకు రాగము గూర్పఁ గొలంతలేనిమే
ల్పస నలరారు నొక్కయెలప్రాయపుజాలరికన్యకామణిన్. 71

ఉ. అన్నులమిన్నలం ద్రిభువనాంచితరూపవిలాసమాన్యలం
గన్నులఁ గంటిఁ గాని శశిఖండనమండన యెందునేని న
క్కన్నియవంటిసోయగపుఁగల్కిఁ గనుంగొను టే నెఱుంగ నో
యన్న గణింప శక్యమె మహాహికి దానికడిందియందముల్. 7

ఉ. కొమ్మలు పాటిరో మరునికొమ్మ కరంబునఁ గ్రాలుజాళువా
బొమ్మకుఁ గమ్మవింటినెఱిపోటరి క్రొవ్విరితోఁటలోనిదా
నిమ్మకు నిమ్ముల న్వలచునిద్దపుసంపెఁగపూవుఁగొమ్మ కం
దమ్ములకెల్ల నిక్కడ యనం దగు జాలరిముద్దుగుమ్మకున్.

చ. కులుకుమిటారిగబ్బిచనుగుబ్బలసోయగగానిగారవుం
దొలుకరికార్మెఱుంగుల నెదుర్కొనుకొప్పుమిటారునిద్దపుం

గలికిపిసాళివాలు తెలిగన్నులతీరు గణింప మాయురే
యల కలకంఠకంఠి కలరాగునొయారులు దానికుద్దిరే. 74

సీ. చిన్నారిజాబిల్లి కన్నె గెదఁగిపువ్వు వెన్నెల తెలినిగ్గువన్నెలగని
తళుకుపుత్తడిబొమ్మ తొలుకరిక్రొమ్మించుతలిరుజొంపపుమావిపలుకుచిల్క
చక్కెరలప్పగొజ్జఁగినీటిపెనువాక కపురంపుబరిణె చెంగలువకొలను
వలపులదీవి జవాదినించినబావి కమ్మకస్తురిక్రోవి నిమ్మపండు
గీ. చికిలినిద్దంపుటద్దంబుపికిలిబెండు, ముగుదతిలమిన్న వెలలేనిమానికంబు
నాఁగ వలరాచు వయ్యారిలనాగబాగు, దెలుప శక్యంబె యేలాటిపలఁతికైన 75

సతిమోమునకు నోడి గందమామ కృశించి వెలవెలనై పైట వ్రేఁగుచుండెఁ
జెలిక్రొమ్ముడికి నోడి తొలుకరిమబ్బులు నిలువెల్ల విషమూని మలలుమెట్టె
నువిదపాలిండ్లకు నోడి బంగరుగిండ్లు కాఁకచే మడుకుచుఁ గఱఁగఁబాఱెఁ
జేడికన్దోయికి నోడి బేడిసమీలు మిట్టిపాటున నేట బిట్టుపడియెఁ
గీ. దరుణినునుజెక్కులకు నోడి దర్పణములు
మైల వాటిలఁ గొంతెఁ గన్నాని యుండె
నేమిచెప్పుదు నఖిలలోకేశ నీకు
దానిసౌందర్య మెన్న నాతరము గాదు. 76

సీ. అలికులవేణి శైవలరోమవల్లరి సారసవదన కల్హారపాణి
కలహంసగామిని కచ్ఛపచరణాగ్ర మకరజంఘాలతశకులనయన
కలభోరుకాండ కోకపయోధరద్వయ సైకతజఘన కింజల్కరదన
కంబుకంధర వీచికావళియావర్తనాభి కావిపరమృణాలబాహ
యనుచు భువనాభిరామవిఖ్యాతి నెపుడు, వెలయుచున్నట్టియాఘనవేణితోడ
గరుడగంధర్వయక్షకిన్నరనిలింప, భుజగగజగామినులు సాటి పోలఁ గలరె. 77

క. పాదవుగ నెగని తళుకు కన్ని, పాదచూపి యదృశ్య మగుచుఁ బోవు మెఱుంగుల్
పడఁతుకనెమ్మేయి జిగి కెన, యిడఁగాఁ బోలవుగదయ్యా యిందువతంసా. 78

సీ. ఇది కీలుజడ గాదు చదువుపల్కుహుమావజేరుని వాఁడికటారుగాని
యిది నెమ్మొగము గాదు కోదమతు మైదవారివిలు కానియద్దంపుఁబలక గాని
యివి కటాక్షము లౌను చివురాకుబాకుసాధనుగానితూఁపుమొత్తములు గాని
యివి కుచంబులు గావు పూజిరానెఱదొదు మేలిబంగరుబొంగరాలు గాని
గీ. యిది వలపుకెంబెదవి గాదు మదనభూప
కరవిరాజితపద్మరాగంబుగాని
యనుచు రసికాగ్రణులు దనయువయవములఁ
బొగడ నెగడొందు నార యాచిగురుఁబోఁడి. 79

సీ. కలికివాల్గన్నులఁ దిలకించి చూచిన వెడవింటిదొరబాణవృష్టి గురియుఁ
గులుకుచు జలిబిలి తెలినవ్వు నవ్వినఁ గమ్మగ ప్రపుదుమారమ్ము గ్రమ్ముఁ
దొకతొక వెలయుముద్దులమాట లాడిన సొంపార విరితేనెసోన చిలుకుఁ
బుడమిఁ జక్కఁగఁ జూచి యడుగిడి నడిచినఁ బలితంపుఁగెంపురంగులు వెలుంగు
గీ. కచకుచకటిభరంబుచేఁ గౌను వడఁక, నూత్నచామీకరామూల్యరత్నఘటిత
కాంచికాఘటికాఘణంఘణలు సెలఁగ, దాసకులజారి మరునిబిడ్డపుఁగటారి.
ఉ. ముద్దులకేమి నాపలుకు మూనశరాంతకచిత్తగింపు ము
మ్మిద్దియతెల్చుఁచూ పతను మోహనజాతశిలీముఖంబుతో
సుద్దిడుకంగఁ బోయి మది నూహ యొనర్పఁగ నట్టు గానిచో
నద్దిర యెల్లవారిహృదయంబులఁ గాఁడి చనంగ నేర్చునే. 8
ఉ. అలతకూన యాలలన యాలవలీదళకోమలాంగి యా
లోలకురంగశాబకసులోచన యామదచంచరీకని
లాలక యాసముగ్రతుహినాంశుమనోజ్ఞముఖారవింద యా
నిలకచాకరోగ్రమణి నీకుఁ దగుం బెండ్లిమాట లేటికిన్. 82
గీ. గంగ యనుపేరు దన కొసఁగంగ భువన, మంగళాకృతిఁ బొల్పునయ్యంగజాల
లామఁ గనుఁగొంటివేని యోస్వామి నీకు, నిరుపమానందసంసిద్ధి దొరకుఁ జుమ్ము.
గీ. అని మునీంద్రుఁ డెఱింగింప నధవుఁ డపుడు, కొలువు చాలించి యెల్లవారలను బోవఁ
బనిచి తనతోడ రాఁ గోరుపర్వతాధి, రాజపుత్రిక నంతఃపురమున నిల్పి. 84
సీ. జడలు చిక్కులువాపి నడునెత్తి నిగవైచి తావిసంపెఁగపూలదండఁ జుట్టి
నిటలభాగమున నున్నావిబూదిరేఖయుఁ బూపకస్తురిముక్కబొట్టు వెట్టి
పలువబంగరుకాలువలెవాటు గావించి మొలఁ బట్టుదట్టియమ్ముల బిగించి
నలిచిగాటెంపుమీసలు చక్క సవరించి బవిరిగడ్డము దీరువడఁగ దువ్వి
గీ. కేలఁ జారుకపాలంబు గీలుకొలిపి, మేన నవగంధసారంబు మెదిచి పూసి
గిలుకుపావలఁ దొడిగి యగ్గిరిశుఁ డప్పు, డతిమనోహరజంగమాకృతి ధరించె. 85
వ. అట్లు జగన్మోహనోదారజంగమాకారంబు ధరించి చనుదెంచి యేలూరి
మహానగరంబుఁ బ్రవేశించి తదంతికప్రదేశంబున నొక్కచోట. 86
మ. కనియె న్నిలగళుండు బిల్వబదరీఖర్జూరజంబీరచం
దనమందారలవంగచూతలవలీనారంగభల్లాతకీ
పనసాశ్వత్థకపిత్థతాలవటరంభానారికేళాదికా
వనిజాతానికభాసమానము సరోవాపీప్రతోద్యానముల్. 87
సీ. కలకంఠకులకంఠకాకలీధ్వానము ల్చెలఁగి దిగ్వలయంబు చెవుడు పఱుప
శుకశారికాకదంబకమృదుస్వనములు జనుల కామోదంబు సంఘటింపఁ

ప్రమదనృత్యన్మత్తబర్హిణారావంబు అవిరతశ్రుతిపుటోత్సవ మొనర్ప
నవనవమకరందనందితేందిందిరగానము ల్చిరసుఖాకరము గాఁగ

గీ. ఘనమరాళారవంబులు గ్రమ్ముకొనఁగ, బంధురసుగంధగంధిలగంధవాహ
కాబకము లోలి నధ్వశ్రమము దీర్ప, నతిమనోహరగతిఁ బొల్చె నవ్వనంబు. 88

వ. అందు. 89

సీ. తావులీనెడుగుజ్జుమావిమ్రాకులచెంతఁ జెనఁగొన్నగున్నసంపెఁగలపజ్జఁ
గపురంపుటనఁటిమోఁకలకంటి ప్రాఁకిన పసుపంపుద్రాక్షపందిరులక్రింద
గమ్మగమ్మవలచు చొక్కంపుఁగొజ్జఁగినీట నేటఁజక్కరకడ నిరువుకొన్న
బలితంపుఁజెంగల్వబావులకెవులఁ బన్నినచలువచప్పరముక్రింద

గీ. నందముగఁ బొల్చునిద్దంపుఁజందమామ, ఱాలఁ గట్టినజాలువామేలితిన్నె
మీఁద మోదంబు దళుకొత్త మిక్కుటంపు, ఠీవిఁ గూర్చుండె జంగమదేవుఁ డపుడు.

వ. అయ్యవసరంబున. 91

సీ. కురులుచిక్కులు విప్పి కొప్పు బిప్పుగ దిద్ది యసదుకస్తురిబొట్టు నొసలఁ బెట్టి
వలిపెచెంగావిపావడ చక్క సవరించి కలికిబంగరుచేలఁ గటి ఘటించి
చిలుఁగుపైఁటాణికంచెల గుబ్బలం బిగించి కడితంపువలిగమ్మగలప మలఁది
కలికికన్నులమించుకజ్జలంబు ధరించి యలరుసంపెఁగదండ లరుత నించి

గీ. హారకేయూరకటకమంజీరకాంచి, కాంగుళీయకకర్ణపత్త్రాదివివిధ
మణివిభూషణనిర్మలఘృణులు వెలుఁగ, గంగశృంగారలీలావృతాంగి యగుచు.

గీ. సెచ్చెలులఁ గూడి వేడుక లచ్చుపడఁగ, నొచ్చె మొదవనిహాళిమైఁ బెచ్చుపెరిఁగి
పచ్చవిల్కానిమేటిరాలచ్చి యనఁగ, వచ్చి చెచ్చెర శృంగారవనము సొచ్చి. 93

క. చొచ్చి ఝణంఝణునినదస, ముచ్చయరంభాసమానమోహనకటకో
ద్యచ్చరణసరసిరుహ యై, విచ్చలవిడిఁ బూలుగోసె వెలఁదులు దానున్. 94

చ. చిలుకలఁ దోలి కోయిలలఁ జిందరవందరగాఁగ నేలికే
కుల బెదరించి తుమ్మెదల గుప్పనఁ బాఱ నడంచి యంచలం
గొలకులఁ బాపి జక్కవలకు న్నిలరాయిలు చూపి పూఁబొదల్
వలఁగొని దూఱి కప్పురపువంతుల దాఁటి విహారలీలలన్. 95

గీ. కప్పురము కేఁచిలతికానికాయ మూఁచి, పాదపము లెక్కి తియ్యనిపండ్లు మెక్కి
సరసగతి డాసి తావిక్రొవ్విరులు గోసి, చెలులు పుష్పాపచయకేళి సలిపి రోలి. 96

సీ. కనకాంగి నీనాసికకు జోక యగువీఁకఁ గనుపట్టుచున్నవి గంధఫలులు
శుకవాణి నీవాతెఱకు సాటి యగుపాటిఁ దనరారుచున్నవి దాసనములు
ముకురాస్య నీగుబ్బలకు నుద్ది యగుబుద్ది నిం పూనుచున్నవి యీడెపండ్లు
కలకంఠి నీనాభికకు సరి యగుమురిఁ బొలుపొందుచున్నవి పొన్నపూలు

గీ. ముగుద నీదంతములకేన యగుపొగరున, మురువుఁ జూపుచు నున్నవి మొల్లమొగ్గ
లనుచు నన్యోన్యసరసోక్తు లాడుకొనుచు, ననలు గోసిరి సరసిజాననలు మొనసి.

ఉ. అప్పుడు జంగమేశ్వరుఁ డొయారము దద్దయు మీఱ వేడ్కతో
గుప్పున లేచి పాదములఁ గుత్తపుఁబావలు మెట్టి లీలన
య్యొప్పులకుప్ప లున్నయెడ కుబ్బులరారఁగఁ జేరి కోరికల్
చొప్పడ మ్రోల నిల్చి మదిఁ జొక్కుచు నబ్బురపాటు వాటిలన్. 98

సీ. చిన్నారిమోమునఁ జిలుకుచెమ్మటఁ గ్రమ్మఁ గొనబొఱుపువ్వులఁ గోయుదాని
గడితంపులేయెండఁ గ్రాఁగిననెమ్మేయిపసల నందంద నిలుచుదానిఁ
దాఁతిపూఁబొదరిండ్ల దూఱుచో నడలిన క్రొమ్ముడి సవరించుకొనెడిదాని
గుత్తంపువలిగబ్బిగుబ్బచన్నులమీఁద నులుకొన్న సరులిమ్ముకొలుపుదాని

గీ. నీటుమీఱంగ జిలిబిలిపాటఁ బాడి, బోటులకు సంతసం బెదఁ బూచుదాని
వన్నియలకెల్ల మిన్నయై యున్నదానిఁ, జిన్నిప్రాయంపుజాలరికన్నెఁ గనియె.

చ. కని యొనలేనికూర్మి మదిఁ గ్రమ్మఁగ నమ్మగమిన్నమిన్నకా
మననిజరాజ్యలక్ష్మి యగుమానినిడగ్గఱఁ జేరి కోరికల్
బెనఁగొన నార యీకులుకుబిత్తరిగుత్తపునిండుగౌఁగిటం
దనివిసనన్ సుఖింపక నితాంతలతాంతశరార్తి యారునే. 100

క. అన్నుల నెందఱి నేనియుఁ, గన్నులఁ జూచితిమి గాని గరుడాహిమరు
త్కిన్నరనరభామలలో ని, కన్నెలతలమిన్నఁ బోలఁ గలరే యెన్నన్. 101

గీ. సకియనెమ్మోము పున్నమచందమామ, కలికికన్నులు వాలుగగండుమీలు
పాలఁతిచనుగుబ్బ లపరంజిబొంగరాలు, తరుణిచెక్కులు మృదునవదర్పణములు.

గీ. కలికి పదియాఱువన్నెబంగరుసలాక, గావలయు నద్దిరా యట్లు గాక యున్న
నఖిలసంగపరిత్యాగు లైనయతుల, డెందములకైన నాస పుట్టింపఁ గలదె. 103

చ. పగడము బంధుజీవకముఁ బంకజరాగము దాసనంబు లేఁ
జిగురును బింబికాఫలముఁ జెందరముం దిర మెప్పు నిప్పుడే
ముగుదులమిన్నతియ్యనునుమోవికి సాటి యటంచు నెంచఁగాఁ
దగదుగదా తగం దగవుదప్పి వచించుట దోసమే కదా. 104

చ. మొలకమిటారిగుబ్బలును ముద్దులుగారు మెఱుంగుచెక్కులుం
దళుకుపిసాళిచూపులును దమ్మివిరి న్నిరసించుమోము క్రొం
దొలుకరిమబ్బులం దెగడుదోరపుఁగొప్పును గల్గి యొప్పు ని
క్కలికియలంతిజవ్వనము గన్నులపండువ యయ్యె నద్దిరా. 105

సీ. గజనిమ్మపండులఁ గజిబిజి యొనరించి మాలూరఫలములఁ గేలిసేసి
తమ్మిమొగ్గలచో కాటమ్మెల్ల సహలించి క్రొన్ననబంతులఁ జిన్నఁబుచ్చి
కరికుంభములఁ దిరస్కారంబు గావించి యుపరంజిగిండుల నపహసించి
పొన్నకాయలసొంపు సన్నగిల్లఁగఁ జేసి జక్కవకవ నెకసక్కె మాడి
గీ. మేలిరతనంపుబలుబొంగరాలఁ దెగడి, కనకధాత్రీధరేంద్రశృంగములఁ గేరి
లీల నలరారు నార మే లీలతాంగి, కులుకుచిబ్బెపునలిగబ్బిగుబ్బదోయి. 106
గీ. బాలికామణి వెన్నుగుల్ బారఁజేసి, చేడియలమిన్నకన్నులు చేరఁజేసి
కలికివలిగబ్బిగుబ్బలు గాసిఁజేసి, చేసి నను మేలమాయంబు నీసె నజుఁడు. 107

చ. నిలుకడఁగన్న కార్మొయిలుఁగునిద్దపుఁబల్కుఁ జేర్చుకొన్న క్రొం
దళుకుపసిండిబొమ్మ నెఱతావులు గ్రాంచినమానికంబు చే
ష్టలుగలగుజ్జుమావి దిగఁజాఱిననిర్మలచంద్రరేఖ యీ
యలికులవేణిసోయగము మారరయొయ్యారుల నెంచుఁ జెంచునే. 108
ఉ. అద్దిర నాదు దీని నెద రబ్బినగొబ్బునగుబ్బదోయిఁ జే
కొద్దిగఁ బట్టి కౌఁగిటను గూర్చి నిగారపుమోవిసారెకు
న్ముద్దులుగొంచు మన్మథవినోదముల న్విహరింతుఁ గానిచో
నెద్దియు నామనంబున కొకింతుక కోర్కెఁ దీర్ప నేర్చునే. 109
క. అని పలుకుచు మెల్లన యా, వనితామణిఁ జేర నరిగి చలపులు నిగుడన్
మనసిజమదసంరంభుఁడై, ప్రాణియొక్క మృదువచనరచన లలరారంగన్. 110
క. ఎవ్వతవు నీవు దవ్వుల, యువ్వలఁ గోయంగవచ్చి పొలుపారకులే
జవ్వనపు మేను గందఁగ, నివ్వనవీథిం జరింప నేమిటి కబలా. 111
క. కాముని బూజ యొనర్పనొ, హైమవతీకమలనకు సమర్పణ యిడనో
గోముగఁ బాన్పలరింపనొ, యేమిటికి పూలు గోసె దిభరాడ్గమనా. 112
క. కొమ్మలను గూడి క్రొవ్విరి, కొమ్మలపై నిమ్మునీటఁ గూరిమిమునా
అమ్ముల నెమ్మదిఁ ద్రిమ్మగు, తుమ్మెదలఁ గలంచె దిట్టు దోసము గాదే. 113
క. చెంగల్వలు వలెనో గొజ్జంగులు గావలెనో మంచిచేమంతులు సం
పెంగలు వలెనో తెచ్చెద, శృంగారవతీలలామ చెప్పుమా నాకున్. 114
క. కొమ్మా కొమ్మా యిదె విరి, కొమ్మ కరమ్మలని సోలసి కోసితి విరై
రమ్మా పూఁబొదరింటను, నిమ్మారఁగ మతియుఁ గోని యిచ్చెద నచటన్. 115
క. జిలిబిలి చెమ్మట మోమున, నలుముకొనం బొదలవింట నలసెద వేలా
వెలిపూసురటి న్విసరెద, నిలుమా యొక్కింతసేపు నీరజవదనా. 116
క. నను లాఁతివానిగా నె, మ్మనమునఁ దలఁపఁగఁ జనదు మానిని వేడ్కన్

నను గప్పురంపువిడె మిది, గొనుమా యనుమాన ముడిగి కువలయనయనా. 117

వ. అనిన నేమియు మాటాడక గంగ యూరకుండినఁ దత్సఖీజనంబు లజ్జంగము
ఖ్యం గనుంగొని యిట్లనిరి. 118

క. ఎవ్వఁడవు కోరి యే విప్ర, డివ్విధమున నాము మీఱి యేకతమ వనిం
బువ్వులఁ గోయుచు మెలఁగెదు, జవ్వనులం జెనకి పొదువఁ జాగితివి భళీ. 119

క. ఏరా గారా మాఱఁగ, నారాటం బెత్తి హత్తి యబలలఁ జెనకన్
మేరా తీరా యూరక, పోరా పోరాము లడిగి పొత్తుటకైనన్. 120

వ. అనిన వారివచనంబులు సరకుఁగొనక వెండియు జంగమేశ్వరుండు గంగం
గనుంగొని. 121

గీ. పువ్వుబంతు లొసంగవే పువ్వుఁబోఁడి, చిగురుటాకైన నీగదే చిగురుఁబోఁడి
దండఁ గూరిచి యిడుము వేదండయాన, యనుచు మెల్లనె వక్రోక్తు లాడుకొనుచు.

సీ. కిన్నెర మీటి కన్గిటి సన్నలం జేయుఁ బకపక నగి యేలపదముఁ బాడుఁ
గొంగేలలాంతంబు గిరగిరఁ ద్రిప్పు లోఁ జొక్కుచు వెడవెడ మొక్కుమొక్కు
లింగ లింగ యటంచుఁ జెంగున దాఁటు మీసలు గీటు గడ్డంబుఁ జక్కఁదువ్వుఁ
గులుకుచు జిలిబిలిపలుకులఁ జెప్పు గామిని యయి పైటకొం గొడిసి తిగుచుఁ

గీ. దిరిదిరి బతిమాలి దిక్కులు దిరిగి చూచు, నవలి కరుగుదోఁ ద్రోవ కడ్డపడి నిలుచు
వలపు మీఱంగఁ జెలిమురుల్ గొలుపుకొనుచుఁ, గోడెప్రాయంపుజంగమకులవిభుండు.

క. క్రొమ్మావికొమ్మచివు రదె, కొమ్మా కెంగేల నందుకొమ్మా యని యా
యమ్మాడుఁజిలుగుపయ్యెదఁ, గ్రమ్మినవలిగుబ్బదోయిఁ గనుఁగొను వేడ్కన్. 124

వ. ఇత్తెఱంగున హొరంగునం జెలంగి మెలంగుజంగమపుంగవుం గనుంగొని యంగనా
మణు లిట్లనిరి. 125

క. మున్నెప్పుడుఁ గొమ్మలలో, నిన్నిక గాఁ దిరిగినాఁడ వేమి బళా మేల్
కన్నులవెంబడిఁ బడి కదు, మున్నతివల మెలఁగ దిట్లు మోసంబు గదా. 126

క. కొంచక మున్నెందటి భ్రమ, యుంచితివి గదా చెలంగి యీవేసమునన్
మంచిది యిదత్తఱము లొ,క్కించుక మారెయుడల సాగ వే లామాటల్. 127

సీ. కరతాళగతు లొసంగఁగఁ దందనా ల్పాడి చొక్కుచుఁ జిందులు ద్రొక్కెదేమి
కిలకిల నగుచుఁ గన్గిట సన్నలు సేసి పలిపువ్వుఁబోదలఁ బిలిచెదేమి
గరువంపుఁజిన్నరాగము దీసి యబ్బురపాటుగాఁ గిన్నెర మీటెదేమి
చెలరేఁగి గురవప్పశివ యంచు నటునటె వెడవెడ గఁతుల వేసెదేమి

గీ. కిసిఁదిరియు యాౡర మేపార నడరి మంచి, విరులబంతులఁ దెమ్మని వేఁడెదేమి 5
జోగు లెచ్చట యిల్లాలిజోటు లెచట, కానిబుద్ధులు మాని వేగంబె చనుము.

క. అనవిని జంగమకోఁ డా, ననబోఁడుల నిసడించి నగుచుం గన్యా
జనచూడారత్నంబుం, గనుఁగొని వెండియును జెప్పఁ గదురఁగఁ బలికెన్. 179

ఉ. అంగన నిన్నుఁ గంటి నెత్తియం గనుపండువుగాఁగ నేఁడు నీ
బంగరుబొంగరాల కెనవచ్చుమిటారపుగబ్బిగుబ్బ లిం
పొంగఁగఁ గౌఁగిలించి వలపుల్ దలకొత్తి సుఖింపఁ జేయవే
జంగమవారిపాపఁడ భుజంగకలాపమనోజ్ఞభూషుఁడన్. 180

క. వెండియుఁ జైఁడియు నాయొడఁ, గొండలవలె నుండు మెండుకొని యెప్పుడు నో
యండజగామిని చూడ న, ఖండమహోన్నతవిభూతిఁ గలవాఁడఁ జుమీ. 181

గీ. ఎంతకన్నను నిడకొన్నఁ గలఁగకుండ, గరిమ నుండుదుఁ దలపువ్వు గందకుండ
వెలఁత నన్నేలు చిరసుఖాన్వితునిఁ జేసి, నిన్ను నే ప్రొద్దుఁ దలమీఁద నిలుపుకొందు.

గీ. అంబుజాక్షి కుబేరునియంతవాఁడు
బలియుఁ డొక్కఁడు చెలికాఁడు గలఁడు నాకు
మఱియుఁ దఱుఁగనిసిరి గలనెఱ యనుంగు
గలఁడు గద నాకు బ్రహ్మను గన్నవాఁడు. 183

క. మేనెల్లఁ దెల్లఁబాఱెను, గానంబడ దిప్పు డొక్కకన్నులకొంబుల్
జానరవిజడలుకంటెను, జానరొ నినుఁ గోరి హైదొసంగులు వడుటన్. 184

గీ. అన్న మెన్నడు నెఱుఁగ నీయానఁ గన్నుఁ, దెఱవ వెఱతును మంటచేఁ దెఱలుచుండు
మేను నగ మయ్యెఁ గుత్తుకలోనిచేఁదు, వదల దలివేణి నీమీఁదివలపుకతన. 185

క. పులికిని భూతంబునకున్, బలితపుమత్తేభమునకుఁ బాముల కెదలోఁ
దలఁకక తిరిగెద నెప్పుడుఁ, బొలఁతీ నీమీఁదివలపు పొరిఁబొరిఁ బెరయన్. 186

శా. రావే మత్తచకోరచారునయనా రావే జగన్మోహినీ
రావే రాజమరాళికాగమనా రావే లతాంగీమణీ
రావే పూర్ణసుధామయూఖవదనా రావే మిళిందాలకా
నావెంటన్ రతికాగృహంబునకుఁ గందర్పాహవక్రీడకున్. 187

క. మారుని నేమును గెలిచితి, వైరము దీర్పంగఁ బూని వాఁ డిపు డెదిరెన్
హా రమణీరతిరమణుని, వారుణి నన్ను రతుల నలరింపఁగదే. 188

సీ. కమ్మకొమ్మనికమ్మకెమ్మోవిపానకం బెమ్మెతోఁ గ్రోలంగ నియ్యరాదా
తళతళల్ దులకించుబెళుకువాల్గన్నుల సోంపార మోమెత్తి చూడరాదా
నిక్కుచక్కనిగుబ్బ లక్కునఁ గదియించి బిగియారఁ గౌఁగిటఁ బెనచరాదా
ఘనజఘనస్థలఘటితనీవీబంధ మెడలించి సురకేళి నెనయరాదా

గీ. చిల్కచిల్కనఁ జేనియల్ చిలుకఁ గులికి
పలుకఁగారాదె సిగ్గు నిప్పచ్చరముగఁ
జెలులటుక్కలఁ దలఁపుచ నిలుపఁబోక
మానినీమణి తమిఁ దీర్చి మనుపు మిపుడు. 139

క. అగ్గలపువలపు సొలపులఁ, బెగ్గిలి నిను వేఁడుకొనెదఁ బ్రియమారఁగ నన్
డగ్గఁ గవుంగిటఁ గూర్పవె, సిగ్గులను వీడనాడి చిగురుంబోఁడీ. 140

క. నన్నన్యుం గాన్నెన్నక, సన్నకసన్నగను గోర్కెసమకూర్పవె నీ
కన్నెతనపుమున్నెతనపు, మున్నెతనలు నూపనేల ముద్దులబాలా. 141

వ. అని యనేకప్రకారంబులఁ బ్రార్థించిన నమ్మించుఁబోఁడి యించుక తల వంచి యూరకున్న సంగడికత్తియ లజ్జంగమేశ్వరున కిట్లనిరి. 142

క. జంగమదేవర పని యొక, భంగిం దాగితిమి గాక బాపురె నిన్నున్
భంగించి పోఱఁ దఱుమమె, లాంగల మతియుక్తులైన లోకం బెఱుఁగున్. 143

క. అఱమఱ లేటికి మాతో, మఱిమఱిఁ గొఱగాని వెడఁగుమాటలు పలుకన్
వెఱపవు మంచిదె వాచే, నెఱిఁగెదుగద యింక నిపుడహీనగుణాంకా. 144

చ. సరిసరి మంచిజాణవె విచార మిఁకేటికి నన్యకామినీ
సురతవిహారలంపటతఁ జొక్కుచు మేలము లాడవచ్చె నీ
కరణి మెలంగుచుండుటకుఁ గా దనువారలు లేరు ధాత్రిపై
హరిహరి యింతెచుండగపుటాటలఁ గంటిమె యెందు జేనియున్. 145

క. తిరుసుకదినుని వెంతర, కర మరుదుగ నఁదుటఁ గన్న గలవాఁ డైనం
దరలి చనగలఁడె మాతో, విరసించి యహాహా కడిందివింతలు పుట్టెన్. 146

క. కావరమున మా చెలిపై, నివిధమునఁ గన్నవేసి యెలయించెద వో
మావారు విన్న జంగమ, దేవర ననుకొన్న నీకుఁ దిప్పలు రావే. 147

వ. అనిన నజ్జోగిరాయండు వారల కిట్లనియె. 148

మ. పలుచందంబుల వేఁడుకొన్న నకటా బాలామణిం గూర్పకే
చల మారం గలఁగిం(హిం)పఁజూచితిరి వాచాలత్వము ల్మీఱ నె
చ్చెలులిట్లందఱు మీరు గల్గుటకు రాజీవాననుం గంతువా
లరుందూపులపాలఁ బో నిడెదరా హా యెంతగయ్యాళులే. 149

మ. కలకంఠంబులు శారికల్ శుకములుం గాదంబముల్ భృంగముల్
బలము ల్తోడుగ వెంట నంటి కొలువన్ బాలానిలంబు ల్కలం
కుల రాఁ బంకజవైరి మింట వెలుగం గో యంచుఁ బెల్లార్చి మీ
కలకంఠీమణికై పరుం డెదురుచోఁ గాపాడఁగా నేర్తురే. 150

వ. అని పలికి వెండియుఁ గంగం గనుంగొని. 151

క. ఉన్నవిధంబున వేఁడిన, సన్నుత నన్నుఁ గనుఁగోర్కి సమకూర్పక హా
మిన్నందిపొంగి పారలెద, వన్నన్న గణింప బల్లియాలివి గదవే. 152

క. తాఁకుచుఁ బూఁపాదరెల్లను, దూఁకుచు బలితంపుఁజెట్లతుది కెక్కి వడిం
జాఁకుచుఁ బెద్దలయాఁవలి, మీఁకుచు విహరింప నీకు మేరయె చెప్పుమా. 153

క. పలుమాఱుఁ బతిమాలిన లోఁ, గలఁక వహించుకొని లోఁతు గనఁబడనీ కీ
మలికలఁ బెట్టెదు నీకు, న్నిలువెల్ల విషంబు గదవె నీరజగంధీ. 154

క. వినుము విను నాపలు కిప్పుడు, వనజాతముఖీలలామ వాలెము నాతోఁ
జెనఁగొనఁగఁ జనిన నవ్వుల, ననిశము భంగములపాలఁ బడలేదవు సుమీ. 155

గీ. అనినఁ జెలువవ్వు లోలోన నడచుకొనుచు, గంగ తనతక్కుఁ క్రొవ్వాడికలికి మాఁపు
లతనువిరిగల్వతూఁపులై యతని కోఁడ, నింపు దీపింప మెల్లన నిట్టు లనియె. 156

క. భళిభళి సర్వజ్ఞుఁడవే, పలుకుల కింకేమి లోఁతిపడుచుల వెంటన్
వలఁగొని తిరిగెదు నిన్ని, యిలఁ గాదనువారు లేరె యింతటివారున్. 157

గీ. పరసతీలోలుఁడవు నీవు జాలి మీఱ, నచలసంస్థితి సానుల వంటి తిరుగఁ
జెల్లుగా కిట్టులిల్లాండ్రఁ జేరి పిలఁగఁ, జను నె నీసయ్య మిఁకఁ జాలుచాలుపొమ్ము.

గీ. అని పలుకుచున్నచోఁ జెలులద్దిరయ్య, జోలె జంగంబు నీ కింతజోలి యేల
నరి భళా పదపద రయం చరిదిపోయెలు, గదురఁ జనుదెంచి రిండ్లకు గంగఁగూడి.

క. అత్తఱి జంగమరాయఁడు, చిత్తము తత్తరముఁ జెందఁ జిడిముడిపడుచున్
బిత్తరిపోయి లేదఁ జెనఁగొన, మెత్తంబాటూని చనియె మెల్లనఁ బురికిన్.

వ. చని యొక్క వివిక్తదేవతాగారంబున నుపవిష్టుండై యుండె నని సవ్యసాచికి గాంగేయుం డెఱింగించిన నతం డతని నవ్వలికథావిధానం బె ట్లని యడుగుటయును.

## ఆశ్వాసాంతము.

మ. శరదిందూపమదేహా నిర్జితవిపక్షవ్యూహా కైలాసభూ
ధరశృంగాటకగేహా దీనజనసంత్రాణామితోత్సాహా భా
స్వరగోవల్లభవాహా పర్వతసుతాసంభోగకేలీకళా
నిరతాధ్యంచితమోహా సారబలనిర్నిద్రాగ్రబాహార్గళా. 162

క. కరుణావరుణాలయ గిరి, శరణా శరణాగతార్తజనఘనభయసం
హరణా తరుణాభామృత, కిరణాభరణా సముగ్రకీర్తిస్ఫురణా. 163

మాలిని. పురదనుజవిభంగా భూషితోద్యద్భుజంగా
సురుచిరధవళాంగా సూరిచేతోబ్జభృంగా
కరకలితకురంగా కాంతగంగోత్తమాంగా
తరణిశశిధరాంగా దైవవేశ్యాభుజంగా. 164

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమప్రణీతం బైన శివలీలావిలాసం బను శృంగారరసప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

# ద్వితీయాశ్వాసము.



రాజితగుణసంగా
ఘోరాఘతమఃపతంగ కుతలశతాంగా
తారేశహారనారద
హీరాభశుభాంగ కుక్కుటేశ్వరలింగా. 1

వ. అవధరింపుము పాండునృపాలనందనునకు గంగానందనుం డిట్లని చెప్పం దొడంగె నట్లు శాంబరి జంగమేశ్వరుండు వివిక్తదేవతాగారంబున వసియించి యున్న సమయంబున. 2

గీ. సకలలోకాధిపతి యైనశంకరుండు, గంగకై యిట్టు వంతలం గలఁగుచుండెఁ
బగలు సేయుట తగదని పరచె ననఁగ, గమలహితుఁ డస్తశైలశృంగమునఁ జేరె.

గీ. కాలకంఠుండు జాలారికన్నె తనకు, నబ్బ దని యుబ్బి తాండవం బాడుచున్నఁ
జదలఁ బర్వినకెంజాయజడ లనంగ, నంబరస్థలి సాంధ్యరాగంబు మెఱసె. 4

గీ. చిగురువిల్కాఁడు దనతొంటిపగఁ దలంచి
విశ్వరూపంబు దాల్చి కోవెలలు నళులు
గ్రమ్ముకొని కాల్వఁ జంద్రశేఖరునిమీఁదఁ
గడఁగి దండెత్తెననఁగఁ జీఁకటులు పర్వె. 5

క. సుర లవు డంబరకేశుని, శిరమునఁ బూజించుచున్న జెన్నారెడు క్రొం
బరువంపుబొండుమల్లియ, విరు లనఁ దారకలు గగనవీథి న్మెఱసెన్. 6

క. హరునకు గంగకుఁ బెండిలి, సరగున నగు నని నిలింపసతు లారతు శ్రీ
గరములఁ బట్టిన మేల్బం,గరుపళ్లెం బనఁగఁ దుహినకరుఁ డుదయించెన్. 7

గీ. భవుఁడు జాలారికన్నెకై బడల నొడలి, విరహపరితాపజనితపాండురమరీచు
లబ్బురంబుగ జగములఁ బ్రబ్బె ననఁగఁ, బండురేయెండ తెల్లద నిండుకొనియె.

ఉ. జంగమరాయఁ డయ్యెడల జాలరికేమరుయొయార మాత్మ వే
ధంగుల నెంచి దర్పకుని బారికి బిట్టు చలించి యార సా

రంగవిలోచనామణిపరాకున నన్నికరించి యేగుచో
బంగరుపైఁటకొం గొడిసిపట్టి పెనంగక పోవనిచ్చితిన్.

ఉ. గద్దరిబోటికత్తియలు గ్రమ్మి నయమ్ముగఁ బెక్కులాగులన్
సుద్దులు సేయఁగా భ్రమసి జంటఁ బెనంగఁగ నేరనైతి నే
సుద్దులకేమి యాపలువజోటులపంతము దీటె నేఁడు నా
బుద్ధికి మోస మయ్యెఁ గద బూమెలగీములు వామలోచనల్. 10

చ. మరుఁడు విరోధి చంద్రుఁడును మందసమీరుఁడు నేల నిల్వరీ
పరభృతశారికానికరబర్హిమరాళశుకీమధువ్రతో
త్కరములు నాకు ఘాతములు కంజముఖీమణి బల్గయాళి హా
హరిహరి యింక నీసరసిజాంబకబాధల కెట్లు దాళుదున్. 11

ఉ. ఏగతిఁ దాళువాఁడ నిఁక నెవ్వరి నేక్రియ వేఁడువాఁడ న
బ్బా గిరి నింక నెందు సులభంబుగఁ గన్గొనువాఁడ నెట్లు పై
వేగినదాకఁ దాకువెడవిల్తునితూపుల నోర్చువాఁడ నా
హా గురులింగ దానిహొయలాత్మఁ దలంచిన గుండె ఝల్లనున్. 12

ఉ. హా వికచారవిందముఖి హా మదమత్తమరాళగామిని
హా విబుధేంద్రనీలరుచిరాలకజాలక హా విలాసిని
హా వరవర్ణినీజనశిఖాగ్రమణీ రమణీ ననుం గదున్
భావభవప్రసూనశరబాధల కగ్గముసేసి యేగితే. 13

క. చిరసుఖదాయిని వని నిను, నిరవొప్పఁగ వేఁడుకొనిన నిటు భంగములం
బెరయించి లోఁతు చూపక, దరిఁ జేర్పక సుళ్లఁ బెట్టఁ దగునే గంగా. 14

క. నీకరుణామృతధారా, శీకరములఁ బైనఁ జిల్కి చెచ్చెరఁ దాపో
ద్రేకము చల్లార్పం గదె, రాకాహిమధామసమతరంగా గంగా. 15

వ. అని మఱియు విరహావేశంబున. 16

ఉ. ఎక్కడి నల్కడైన జలకేశిని వచ్చె నటంచు లేచి న
ల్దిక్కులు సూచి కానియెడ దీనత సుస్సురటంచు నూర్చు నే
చక్కట నద్ది గన్గొనిన జాన శుభాకృతి గాఁ దలంచు హా
చక్కరబొమ్మ యంచుఁ బలుచందములం బలవించు సారెకున్. 17

ఉ. కన్నులు మూయుఁ దుల్లిపడి గ్రక్కున దిక్కులు సోయు నూరకే
సన్నలు సేయుఁ బై వలువఁ జయ్యన నవ్వులఁ ద్రోయు మింటిపై
వెన్నెలఁగాయుచందురుని వేఁడికిఁ దాఁ బెడఁబాయు వద్దిరా
చిన్నలజంగమప్రభుని చిత్తవికారము లెన్నఁ జిత్రముల్. 18

క. అలికీరశారికాపిక, కలహంసమయూరకోకిలరవకురలీ
కలరవముల కులికిపడుం, జలిమలయల్లుండు గుండె ఝల్లని లీలన్. 19

వ. మఱియును. 20

క. మదనాదాసకులాంబుజ, వదనామణికోటికొకు నేను వందురఁ బోనీ
కదనా యిటుతేఁపఁగ నళి, గద నాచేనైన తొంటికత మఱచితివా. 21

గీ. మొదల నిలమీఁదఁ బడఁదన్ని పిదప శావ
రించి తలనుంచుకొనుటకు మంచిలెక్క
వా గురుద్రోహి వగుటెల్ల నగపడంగ
నన్ను బన్నంబుకొందింపఁ జన్నె చంద్ర. 22

వ. అని బహుప్రకారంబుల మనోవికారంబులం బొరలుచుండె నంత నిక్కడ. 23

గీ. గంగముద్దుగుఱ్ఱఁడు నాజంగమయ్య, చెలువుమదినెంచి వలపులు చెంగలించి
యంగభవశాతమాతపాయకపరంప, రావికంపితహృదయరాజీవ యగుచు. 24

చ. కళవళపాటుతో నులకకంకటిపై మెయిఁ జేర్చి తద్దయున్
సొలయుచు మావిమానికప్రసూనములం దె సడలించి వైచి యూ
ర్పులం నిగుడించుచుం జెలిమిబోటులకొబ్బిట్లు సళించుచుం గడున్
వలపులవెచ్చ హెచ్చ మదవారణయాన మదిం జలించుచున్. 25

క. చిలుకలు నంచలు రొదలుచుఁ, బిలిచిన మాటాడ నోడి వెగ్గలుచ మదిం
గలఁగుచుఁ బండుచు లేచుచు, బలవించుచు వగలఁ బొగిలి బాములఁ బడుచున్.

మ. తలయూఁచుం దనలోనఁ దానె నగుఁ జెంతం జేరఁగారాక నె
చ్చెలులం దిట్టుఁ గనుంగవం బడిబడిం జిప్పిల్లు బాష్పాంబువుల్
తెలివారుం గొనగోళ్ల మీటుఁ బొగలున్ దివ్యప్రతాపోజ్జ్వల
జ్జలజాతాంబకశాతమాతవిశిఖస్ఫారానలజ్వాలలన్. 27

వ. ఇట్లు విరాళిం గ్రాలుచుండి మఱియుం దనలోన. 28

ఉ. ఏటికిఁ బుట్టదొంపునకు నేఁగితి నేఁగిన నందు నిటునం
బాటిలుచున్నక్రొందలిరుఁబ్రాఁతపుజంగము నేలఁ గంటి నే
మ్మేటి నటుల్లనుంగొని తమిం గవగూడక యేలవచ్చితిన్
బూటకపుంబొలంతుకలు బూమెలఁ బన్నిరిఁ కేమి సేయుదున్. 29

వ. అని జంగమేశ్వరుం గురించి యిట్లనియె. 30

గీ. చిగురువిల్కాని గెల్చు బాసొగసుకాఁడు, లీలమైఁ వచ్చిన నృతిమాలుకొనిన
బేలనై రోలఁ బొమ్మంటి జాలిమాలి, చెల్లఁబో నింక నే నేమిసేయుదాన. 31

ఉ. అక్కట గబ్బిగుబ్బగవ నక్కునఁ జేర్చి కవుంగిలించి క్రొం
జక్కెరమోవిపానకము సారెకుఁ జాల నొసంగి వానితోఁ
జక్కెరవింటిమేల్బిరుదుసంగరలీలసుఖింపకున్నచో
గ్రక్కున నాకు నీసుమశరప్రదరానలతాప మారునే. 32

ఉ. కిన్నెర మీటుచు న్నగలఁ గేరి యలంతిగఁ బాటఁ బాడుచున్
సన్నలు సేయుచు న్నగవుచన్నులపైఁ గనువేసి డాయుచున్
మిన్నక నన్నుఁ బూఁబోదలచాయకు రమ్మని వేఁడునీహొయల్
గన్నులఁ గట్టినట్టు లగుగద్దరిజంగమరాయసారెకున్. 33

ఉ. ఇందునిభాననామణుల నెందఱి నెందఱి ము న్భ్రమించి శ్రీ
నందనుఁ బాఱఁద్రోచితివి న న్నటుల న్వలయించి నెమ్మదిం
గొందల మందఁజేసి యెటకో చనుదెంచితి నీకుటీరపుం
జంద మెఱుంగ నైతిఁగద జంగమరాయ సతీమనోహరా. 34

క. మారాశుగశుకమధులి, ట్పారావతపికమరాళబర్హిమరున్ని
హారాంశులసడి కళికెద, రారా నన్ బ్రేమ నేలరా రభసమునన్. 35

గీ. పూలు పన్నీరు గందంబుఁ బోఁక లాకు
లనఁటిపండులుఁ జక్కెర యగరుఁ గప్పు
రంబుఁ గస్తురిఁ గూర్చి యర్చన లొనర్తు
రార నైశంబ జంగమరాయ యిపుడు. 36

వ. అని పగలం బొగులుచున్నమగువం గనుంగొని సఖీశిఖామణులు దమలో నిట్లనిరి.

గీ. కూళజంగంబు వాలాయుగోళ్లనిండ, వలపుమందేమొ చల్లి యిక్కలికి నిట్లు
మరులు గొల్పెను గాఁబోలుమాయగాండ్రు, జోగులను నమ్మవచ్చునె సుదతులార.

గీ. ప్రేతభూములఁ దిరుగుచు భూతకోటి, వెంటఁ జనుదేర వెల్మిడి యొంటిఁ బూని
తోళ్లు బుసకలు నెమ్ములు బొల్లుదాల్చు, జోగులకుమందుమంత్రములే జోలెనుండు.

వ. అని గంగం గనుంగొని. 40

గీ. ఏమె నీనెమ్మనాన నీ గ్గింతలేక, వానిఁ దిగవాడి పోఁగలెదు గానిఁబడుచుఁ
బెద్ద లెన్నంగఁ దగిననీబుద్ధి విడిచి, చిడిపిజంగంబు దా నేమిసేసెనక్కా. 41

గీ. తల్లిదండ్రులు గుణము పెద్దలును మఱియుఁ, దగినచుట్టంబులును విన్నఁ దప్పుకాదె
చిన్నదానవు నీ విట్లు సిగ్గుమాలి, పలువెఱంగుల నొరలంగఁ బాడియగునె. 42

క. కటకట పిడికెడుకూటికిఁ, గొటికలఁ బడి బికిర మెత్తుకొని మనియెడు న
ష్టటుమాయజంగమునకై, యిటువలెఁ గ్రాశయింపఁదగునె యిందునిభాస్యా. 43

గీ. వద్దు మాయమ్మ యిఁక మంచిబుద్ధిగలిగి, దత్తురపుజంగమయ్యపైఁ దలఁపువిడిచి
నెమ్మినుండుము శుభములు నివ్వటిల్లు, జోగు లెచ్చట నాడెంపుజోటు లెచట.

సీ. కటకట నాఁకటఁ గస్తి నొందఁగనేల పసఁబట్టి దోరంబు మెసఁగరాదె
యొడలెల్ల బిగిదప్పి బడలి యుండఁగనేల యగరుగస్తూరిగంధ మలఁదరాదె
సొగసెల్ల విడిబాలి వగలఁ గుందఁగనేల వెలలేనిరవణము ల్వెట్టరాదె
తలయెల్ల జడగట్టి మలిన మొందఁగనేల తీరుగాఁ గొమ్ముడి దిద్దరాదె

గీ. గట్టివలిపట్టుపుట్టము ల్గట్టరాదె, చెలఁగి కప్రపుఁదములంబు సేయరాదె
దావిక్రొంబువ్వుసరములఁ దాల్పరాదె, యువిద నీకిది యేలాటియోజ చెప్పుము.

చ. చిలుకలఁ గొట్టెదేమి దరిఁ జేరినబోటులఁ దిట్టెదేమి పె
న్వలపులఁ బొక్కెదేమి తలవంచి పదింగనుఁ బొక్కెదేమి యీ
ర్ష్యల నిగుడించెదేమి కనుబొమ్మలసారె ముడించెదేమి నా
చిలుకలకొల్కి నీవెడఁగుచిన్నెలు లిన్నియుఁ జెప్పఁ జిత్రముల్. 46

వ. అనిన వారల కాకన్యకామణి యిట్లనియె. 47

క. చెలులార యింతిదెల్పులు, వలంతిగా నేల ... కనరా
చెలువము గలయువ్వలఁతికి, వలనిది మీతోడ నాకు వాదము లేలా. 48

గీ. వినుఁడు నామాట మీరెల్ల వీను లలర, నలినముఖులార నా ప్రాణనాథుఁడైన
జంగమస్వామిఁ దెచ్చి యొర్వంగరాని, మదనశిఖార్తి మరలించి మనుపరమ్మ.

ఉ. బంగరుపట్టుపుట్టములు భాసురరత్నవిభూషణంబు లిం
పొంగఁగ మీకు నిచ్చి పరిపూర్ణకృపానుతి నాదరింతు నా
లింగముతోడు నాపలుకు లెస్సగ నమ్ముఁడు బోటులార యా
జంగమరాజశేఖరుని జయ్యన నిచ్చటఁ దెచ్చి నిల్పుఁడీ. 50

క. ఇవ్విధము గాకయుండిన, నవ్వల నవ్వలఁ బెనంచి యందఱిలోనన్
నవ్వులఁ బెట్టక యూరక, పువ్వారంబోఁడులార పొండిరువులకున్. 51

మ. కులమెల్లన్ నిరసించి గేలి యిడ నీకోపంబు దీపింప మా
తలిదండ్రుల్ నిలయంబునం దిడక పంతంబారఁ బోఁదోల నీ
చెలికత్తెల్ మతి మీర లంగటను ఛీఛీ యంచు దూషింప నీ
వలకేని న్నగువానికౌఁగిటను నే వాలంబు గ్రీడించెదన్. 52

వ. అని కనరుగనంబడం బలికిన వలికి చెలికత్తియ లొండొరుల మొగంబులు చూచు
కొనువారును, గుజగుజలం బోవువారును, సళించువారును, నిసడించువారును,
నిదె మిడిమేళం బనువారును నై యుండి యలని కొంతతడవున కంచుక గనుయూని
నిదురింపం దొడంగి రాసమయంబున. 53

క. గంగయుఁ గడితపువలువచె, ఱంగు ముసుంగిడి కడిందితాళనమున నా
శృంగారవనికి మెల్లనె, జంగమపుంగవుని వెనుకఁ జనియెఁ గోకస్త్రీ. 54

వ. అట్లు చని వనిం బ్రవేశించి. 55

సీ. పొదుగక గాటంపుఁబొదరిండ్లదండలఁ గొదకొని సారసు వెదకి వెదకి
తిన్ననిశపురంపుఁదిప్పలచొప్పుల నిలుచుచు నందంద నెమకి నెమకి
వలపుగొజ్జఁగినీటివంతెల చెంతల డాసి పద్మాలఁగుల రోసి రోసి
పరువంపువలిదాఁకపందిళ్లసందుల సొలయుచు మఱిమఱిఁ జూచి చూచి

గీ. వలపు లంతంత కుబ్బ నవ్వాన్నకాని
నెందుఁ బొడఁగాననేరక కుంది కుంది
యిందువదన వనితరుబృందములను
అళి అడరంగ నిట్లని యడుగఁదొడఁగె. 56

సీ. చిన్నారివగకాఁడు చిన్నార మీవద్ద నిలిచియుండెడుఁగదా నిమ్మలార
సింగారములకుప్ప చెలువొప్ప మీదండ మొనసియుండెడుఁగదా పనసలార
ముద్దుజంగమకోఁడు మురిమీఱ మీపజ్జ మసలియుండెడుఁగదా మావులార
సెఱజాణతలమిన్న సీటార మీచెంత దాఁగియుండెడుఁగదా దబ్బలార

గీ. యలరువిలుకానిఁదెగడుసోయగము గలిగి
కడిఁదిమీచాయనిగ్గుల కడలఁ బర్వ
జగములెల్లను వలయించుజగమగండు
మీకడకు రాఁడు గద వలిదాఁకలార. 57

క. ఈ డెన్నరానిసొగసుల, నాడెందము గరఁగఁజేసి నలిఁ బెట్టినయా
పోఁడలతలమానిక మిపు, డీడ నిసిడ కీడ కేతేరఁడుగా. 58

క. అన్నన్న కడిఁదివగలన్, నన్ను న్వలయించి చనుట న్యాయమె వానిం
గన్నారఁ జూపఁగదవే, పొన్నా నీ కెన్నరానిపుణ్యంబుగదే. 59

క. జగమెల్లను వలయింపఁగఁ, దగుసోయగమున వెలుంగుదంటవిరాళిం
బొగలించి చనియె వానిం, బొగడా గనఁజేయునీకుఁ బొగడిక వచ్చున్. 60

గీ. తలిరువిల్కానిదాడికి నళికి యుంకి, పలుదెఱంగుల నినుఁగోరి వలసియున్న
చెలియ నలయింపఁ దగదని తెలిపి వాని, నగుపడఁగఁజేయరే కొమ్మటనఁటులార. 61

వ. అని మఱియును జంగమేశ్వరుంగురించి యిట్లనియె. 62

ఉ. ఏలర యింతవింతచలమేలర నన్ను మనోభవానల
జ్వాలలవేఁడిమిం బొగలఁ జాలర తేజవరాలరా మదిం

జాల దిగుల్గ గుల్కొనియె జాలము సేయక వేగవచ్చి నా
ప్రోలఁ గనంబడం గదర ముద్దులజంగమరాయ ప్రొక్కెదన్. 63

ఉ. పొంగుచు నీముఖాంబుజము ప్రొద్దునఁ జూచినవేళ యొట్టినో
యంగజుఁ డెంతయుం గుపితుఁడై వెనుదీయక యేఁచఁదొచ్చె న
న్నంగవలం గలంచి యిటురా రదఁ బెట్టెదవేల చాల నీ
సంగతిఁ గోరుకొంటిఁగద జంగమరాయవిలాసభాసురా. 64

గీ. అనుచు వనమెల్లఁ ద్రిమ్మరి యందు నెచట, జంగమస్వామిఁ గానక గంగ యలసి
చాల నొప్పారుబాలరసాలసాల, మూలమునఁ గొంగుపఱచి కన్మూసియుండె. 65

క. మరుఁ డపు డిందీవరసర, సిరుహానీలోత్పలామ్రశితవిశిఖంబుల్
పొరిఁబొరి వెడవింటఁ దొడిగి, కరిగామినిఁ బింజెపింజె గాఁడఁగ నేసెన్. 66

క. అటు వేసిన హా యని యు, త్కుటిలాలక సోలి తెలిసి కుసుమాస్త్రనిశా
విటమధుకరహంసకుహూ, రటములయానిలముఁ గినుక ప్రబ్బఁగఁ బలికెన్. 67

గీ. పార్వతీశంకరులమీఁదఁ బఱచి మున్ను, బన్నమందిన సుద్దులోపలను మఱచి
యిపుడు నామీఁదఁ దొడిగెద విక్షుచాప, మింక నీవేమియయ్యెదో యెఱుఁగరాదు.

క. సోమా నీవును నేనును, గామాంతకుశిరముమీఁదఁ గలసి మెలసి మా
ప్రేమమున నుందు మిప్పుడు, నామీఁద న్వేఁడిచూప నాయమె నీకున్. 69

సీ. మరుని శంభునికంటిమంట ద్రుంగెడునాఁడు తొంటి మీ రేపోక దూఁతినారు
దర్పకుఁ డభవుచే దగ్ధుఁ డయ్యెడునాఁడు తలఁగి మీ రేయేటఁ గలసినారు
వలరాజు హరునిచే నలిగిపోయిననాఁడు సురిగి మీ రేకోనఁ జొచ్చినారు
మదనుఁ డీశ్వరునిచే మడిసి పోయిననాఁడు పారి మీ రేతిప్పఁ బట్టినారు

గీ. వాఁడు గ్రమ్మర జీవించి వచ్చినపుడు
సిగ్గులేక పెంబడిఁ జేరినారు
మధుపచక్రాంగపరభృతమలయపవను
లార గణుతింపఁదరమె మీబీర మిపుడు. 70

వ. అని యనివారితానంగసంతాపాటోపంబునం బొరలుచుండె నంత. 71

గీ. అత్తగృహమున నక్కడ ననఁగుచెలులు, త్రుళ్లిపడి లేచి సిజ్జయు నెల్లచోట్లు
వెదకి గంగను గానక వెఱఁగుమీఱి, వరుస నందఱు శృంగారవనము సొచ్చి. 72

సీ. కందర్పశరబాధఁ గుందుచు నందంద శివశివా యని సద్దు సేయుదానిఁ
బొగలుచు గడితంపుబుడిబుడి వేఁడికన్నీటిజాల్ కొనగోర మీటుదాని
నెందు నల్కుడు విన్నఁ బొందుగాఁ జెవియొగ్గి పొంచి సల్లడ లాలకించుదానిఁ
బొరిఁబొరి నిలమీఁద బొరలుచు లేచుచు నుసురంచు నిట్టూర్పు లుచ్చుదానిఁ

గీ. గమ్మకపురంపుబలుదుమారమ్ము చిమ్మి, క్రమ్ముకొని వీచువలినాతెమ్మెరలకు
వడలి యొడరార గడగడ వడఁకుదానిఁ, జిన్నికన్నియఁ గాంచి రాచిగురుఁబోండ్లు.

గీ. కొంచి మెల్లన దరి కరుదెంచి లోని, జడుపుదీరంగఁ బుప్పొడిఁ దడిని పైచి
మెదవుగ పురంపుబూఁది నెన్నుదుటఁ బెట్టి, యిందుబింబానలు దాని కిట్టు లనిరి.

ఉ. అమ్మకచెల్ల నీ విటుగ యాశితమ్మున మమ్ముఁ బిల్వకే
ముమ్మర మైన వేదనల మున్గుచు నీవడురేయిఁ గోనకున్
నెమ్మది నొంటి రాఁదగునె నీమదిలో నఖికేల లేదె హా
కొమ్మ వచింపఁ జిత్రము లగుంగద నీదుకడింది చందముల్. 75

క. చిలుకలు గోరువంకలు గో, యిల లంచలు నెమలిగములు నెడపక యెపుడున్
గొలగొలలాడుచు విహగాలి, సలుపఁగ నిమ్మైన వనంబు నికుంజ గొంఱయే. 76

గీ. కొసరి యిట్టి పుప్పొడి కేలుగొనుచు నొక్క
యొడను గాలూనఁ గండదు బడి వరించు
జోగి జంగాల కిరవైనచోటు గదవె
వడఁతి యిఁక వానిపై నాస విడిచిరమ్ము. 77

గీ. అమ్మ నీయింట సకలభాగ్యములు గలవు, దండ్రి యందఱిలో నెన్నఁదగినధనికుఁ
డింకఁ దగుచోటఁ గల్యాణ మెలమిఁ జేయుఁ, వద్దు రావమ్మ యింటికి బుద్ధి గలిగి.

వ. అని యూరడించి నెచ్చెలు లప్పడియ నింటికిం దోడ్కొనితెచ్చి యిష్టగోష్ఠి
ప్రకారంబులఁ బ్రొద్దుగడపుచుండి రంత. 79

ఆ. వేగుఁజుక్క వొడిచె విడునక తామ్రచూడంబు లఱచె నిరులడఁబు మాసెఁ
దూర్పు దెల్లవారెఁ దోయజమిత్రుండు, పొడవుగొండమీఁదఁ బొలుపుచూపె. 80

ఉ. అప్పుడు బోటినెచ్చెలులు హాళిని దాసకులాగ్రగణ్యుఁడై
యెప్పుడు శంఖదేవుకడ నొయ్యనఁ జేరి కుమారిచందముల్
దప్పక చొప్పడం దెలివి తా రట నేఁగిన నాతఁ డాత్మలో
ముప్పిరిగొన్నయంగదల మున్గుచు నేమియుఁ దోఁచకుండినన్. 81

గీ. కొంతతడవు విచారించి కూఁతుఁ బిలువఁ, బంచి కూర్చుండ నిడి బుజ్జగించి యొడలు
దడవి ముద్దాడి కొండొకదవ్వునకుఁగ, మారకామణిఁ గాంచి ప్రేమమునఁ బలికె.

క. అమ్మా నీతలఁ పేమియు, నమ్మతి గాకున్న దిపుడు స్వాంతంబునకే
నిమ్మాట విని కలఁగుము, రమ్మని పిలిపించినాఁడ రయమున నిన్నున్. 88

గీ. తల్లి నీ వేమిగోరినఁ దగిలి సేతుఁ, గాని యిక్కానిపని సేయఁ గాదు సుమ్ము
కోరి మఱి యొద్దయినఁ గాంక్షింపఁ బోకు, చిడిపిజంగమువానిఁ గాంక్షింపఁ దగునె.

క. కులమునఁ గలపెద్దలు విని, వెలివెట్టినఁ గూడి పొత్తు విడిచాడిన పో
తలవంపు లయ్యెడుంగద, తెలియా యీలాటిబుద్ధి చెల్లునె నీకుఁ. 85

క. కులమును రూపంబును గల, చెలువుని రప్పించి పెండ్లిసేసెద నీకున్
జలజాక్షి గానిబుద్ధులు, వల దిఁక నామాట వినుము వాలాయముగన్. 86

వ. అనినం దండ్రికి గంగ యిట్లనియె. 87

ఉ. పొంగుచు మూఁడులోకములఁ బూనికతో విహరించి పాపముల్
భంగ మొనర్చుచు న్భువనపావని నా విలసిల్లుజాహ్నవీ
గంగను గాని నే మనుజకన్యను గాను నిజం బటంచు నన్
జంగమువాఁడు గాఁ దల భుజంగమురాజకలాపుఁ డారయన్. 88

గీ. తండ్రి యిమ్మాటఁ గొంతతనిట్టియున నీ వెఱింగినదిగాక యూరక తెప్పపడక
యతనిరప్పించి వేగ వివాహం బొనర్చు, నిఖిలవాంఛాఫలంబులు నీకుఁ గలుగు.

క. ఇటువలెఁ గాకుండిన నా, నిటలాక్షుని పాద మాన నీయాన మఱిం
తటిబలవంతుని కైనను, గటకట నే నింక నొసఁగ నాంతీంపుదు నే. 90

వ. అనిన సంతసిల్లి శంఖదేవుండు వెండియుఁ గూఁతున కిట్లనియె. 91

గీ. అమ్మ యిమ్మాట నిక్కువం బయ్యెనేని
నతఁడు నిజమూర్తిఁ జూపించి యఖిలదివిజ
వరములఁ గూడి యింటికి వచ్చెనేని
ప్రేమ ద్వార నే నిన్నుఁ బెండ్లిసేతు. 92

క. విను మూరక నిన్నొసఁగిన, జనులందఱు నవ్వఁ గులముపాములు నన్నుం
గనుఁగొని యెగ్గులు పల్కరె, వనితా నీ వెఱుఁగనట్టిపల నిఁకఁ గలదే. 93

ఆ. అనిన సంతసిల్లి యప్పుడు గంగాభ, వాని యభవు నాత్మలోనఁ దలఁచి
కరయుగంబు మోడ్చి స్థిరభక్తి ద్వార, వినయసరణి నిట్టు లనుచుఁ బలికె. 94

సీ. సకలలోకారాధ్య సర్వజ్ఞ సర్వేశ గిరిసుతాప్రాణేశ దురితనాశ
భూతభావన పరంజ్యోతిస్స్వరూప మహాదేవ శంకర హరమహేశ
జగదవనాధార నిగమాంతసంచార ఫాలలోచన భర్గ నీలకంఠ
నందివాహన భృంగినాట్యప్రమోద గీర్వాణసంస్తుత్య పురాణపురుష
గీ. నాదబిందుకళామయ వేదవేద్య, చక్రధర బాణభక్తరక్షాధురీణ
నామనోనాథ కైలాసనగనివాస, వేడ్క నవధారు దేవ నావిన్నపంబు. 95

గీ. దేవ మాతండ్రి యగుశంఖదేవుఁ డిపుడు, నాకు నీకును బెండ్లి యొనర్పఁ గోరి
తివురుచున్నాఁడు బ్రహ్మాదిదివిజవరులు, దవిలి గొలువంగ వేవేగఁ దరలిరమ్ము. 96

గీ. నీకు నామీఁదఁ బ్రేమంబు నెరయఁ గల్గె, నేని నే నీకుఁ బ్రియురాల నేని యిపుడె
పేర్మి కైవార జాలారివిభుని మ్రోల, నిలిచి నామాట సత్యంబు నెరపవయ్య. 97

వ. అని గంగ ప్రార్థింపుచున్న సమయంబున. 98

సీ. హరియు బ్రహ్మయుఁ బురందరముఖ్యదిక్పతుల్ రవిసుధాకరముఖగ్రహపతులును
సనకాదియోగిపుంజములు వశిష్ఠాత్రిమైత్రావరుణిముఖ్యమౌనివరులు
వీరభద్రకుమారభృగవద్భృంగిరిటాదిప్రమథబాధులు అప్సరసలు
గరుడకిన్నరయక్షగంధర్వఖచరగుహ్యకనాగసిద్ధవిద్యాధరులును
గీ. బలసి కొలువంగ వసమానవైభవముతోడ, నందికేశ్వరు నెక్కి యానందలీల
సకలలోకాధిపతి యైనసాంబశివుఁడు, దాసకులమాలి మ్రోలఁ బ్రత్యక్షమయ్యె. 99

వ. అట్లు సాక్షాత్కరించిన దాక్షాయణీవల్లభుం బొడఁగాంచి పులకితాశేషావయవుం
డును, నిర్భరానందరసోత్ఫుల్లనేత్రుండును, విస్మయాకులస్వాంతుండును నగుచు
దాసకులజ్యేష్ఠుండు సాష్టాంగదండప్రణామంబులు గావించి బహుప్రకారంబుల
వినుతించి కృతాంజలి యై యిట్లనియె. 100

గీ. అధిప నాభాగ్యమహిమ శక్యంబె పొగడ, హరిపురందరకమలాసనాదులకును
గనఁబడగరానినిన్ను నేఁ గంటి నిపుడు, పావనం బయ్యె నహహ నావంగడంబు.

గీ. నీచకులయింటి కిప్పుడు నీవు వచ్చి, యొసరఁ గన్యార్థి వై నిల్చియున్నవాఁడ
వేతెఱంగున నిన్ను సంప్రీతుఁ జేసి, యనుపఁ గలవాఁడనయ్య చంద్రోత్తమాంగ.

వ. అని విన్నవించి యొక్క దివ్యమణిమయమందిరంబున విడియించి, సకలబుధబాంధ
వామాత్యపురోహితసుహృజ్జనంబుల రావించి, శుభముహూర్తంబు నిర్ణయించి,
నిజగృహాదికం బలంకరించి తదనంతరంబున. 103

సీ. శుభతూర్యనినదంబు లభినభఃస్థలి మ్రోయఁ గరదీపికాసముత్కరము వెలుఁగ
ద్విజసతీమణులు ముత్తెపుసేసఁబ్రాల్ సల్ల నుర్వీసురేంద్రు లాశీర్వదింప
గణికానికాయ మ్మంగళికనృత్యంబొనర వనజాతముఖులు నివాళు లొసఁగ
వందిమాగధులు కైవారంబు లొనరింప గాయకుల్ గానవైఖరులు నెరప
గీ. మంగళద్రవ్యములఁ గొంచు మఱియుఁ బుణ్య
కాంత లరుదేర నత్యంతకౌతుకమున
సకలబుధబాంధవాశ్రితసహితుఁ డగుచు
భవు నెదుర్కొనెఁ గైవర్తపరివృఢుండు. 104

వ. అప్పుడు మహాదేవుండు దివ్యదుందుభిధ్వానంబులును, గంధర్వకిన్నరగానంబులును,
రంభోర్వశీప్రముఖాప్సరస్సరోజాస్యాలాస్యావధానంబులును, చండీశ్వరప్రపఠిత

గద్యపద్యవిధానంబులును, దివిజర్షభప్రవర్తితదేవతరుప్రసూనంబులును, దేవవిమానంబులును, నిరంతరమహోత్సవలీలామహార్ణవప్రమథభటసంతానంబులును, బృందారకసుందరీసందోహపరివేష్టితచిత్రమణివితానంబులును, ననూనంబులై చెలంగ నందికేశ్వరారూఢుండై, యభినవవైభవంబున శంఖదేవునగరు ప్రవేశించి, యచ్చట వాహనంబు డిగ్గి, వివాహమంటపాభ్యంతరంబు సొచ్చి, సముచిత పీఠాగ్రంబున సుఖాసీనుండై యున్న సమయంబున. 105

ఉ. అంగన లొక్కకొందఱు ప్రయత్నముతోడ నలంకరించి యా
తుంగవివాహవేదికి వధూమణిఁ దోడ్కొనితెచ్చి వేడ్కను
బొంగుచు నున్న యాచకులు భూసురముఖ్యులు నప్పురాంతకున్
గంగను బెండ్లిపీట నిడి కంకణముల్ దగఁ గట్టి రంతటన్. 106

గీ. శంఖదేవుండు దేవతాసార్వభౌముఁ
డగుమహాదేవునకుఁ బ్రియం బలరఁ గాళ్లు
గడిగి తనముద్దుబిడ్డను గంగ నపుడు
ధారవోసె నిలింపబృందములు పొగడ. 107

వ. అప్పుడు. 108

సీ. సిరియును వాణియుఁ జెలఁగి సేసలఁ జల్లఁ గుహుఁ డొజ్జయై లగ్న మరసి తెలుప
హరియును బ్రహ్మయుఁ బెద్దలై పనుల్ సమకూర్ప శ్రుతివాక్యములు వసిష్ఠుఁడు వచింప
శచియు నరుంధతిసతి నివాళు లొసంగ రంభోర్వసులు వింత రవళి నాడఁ
దుంబురునారదుల్ దొడరి గానము సేయ దేవదుందుభులు మేల్ తీవి మొఱయ
గీ. హర్షమున విశ్వకర్మ దా నంది యిచ్చు, కనకమంగళసూత్రంబు గంగ యురతఁ
గట్టె శుభమొందె ననమానగరిమ మెఱయ, సకలభువనాధిపతి యైనశంకరుండు.

గీ. హరునితలఁ గంగయును నన్, ద్రిగుణితంబున హరుండు దమిమీఱంగ నా
విరిముత్తెపుఁదలఁబ్రాలోసిరి చిఱునగవులు దలిర్ప శివకరలీలన్. 110

వ. అట్లు విధ్యుక్తప్రకారంబున వివాహం బొనరించి, కంకణబంధంబు వదలించి యున్నంత నొక్కనాఁ డొక్క శుభమహూర్తంబున. 111

సీ. ఘనసారహిమనీరగంధసారమసారమృగనాభికామోదమేదురంబు
మణిమయపర్యంకమంజూషికాసాలభంజికాపుంజవిభ్రాజితంబు
తపనీయముక్తావితానకలాపికావ్యజనదర్పణచామరావృతంబు
కాలాగరుదశాంకకాళికసామ్రాణికాధూపవాసవాగంధిలంబు
గీ. వీటికావేటికాజాలవిలసితంబు, కజ్జలకరండమండలాఖండరత్న
దీపసంతానదీపితోద్దీపితంబు, నైనయొకకేళికాగృహాభ్యంతరమున. 112

క. మదనవిభంజనుఁ డతిస, మ్మదహృదయాంబురుహుఁ డగుచు మహిళామణికై
యెదురెదురు చూచుచుండఁగ, మదనాగు లొకకొంద రపు డమంద ప్రేముడన్. 113

గీ. బాలికామణిఁ గైసేసి పడకటింటి, కెలమితోఁ దోడుకొని చని యిందుమౌళి
యొద్దఁ గదియించి తమ్ములం బొసఁగఁజేసి, చనిరి సన్నకసన్న నాశంభుఁ డపుడు.

గీ. చిగురుఁబోఁడిని సెజ్జపైఁ దిగిచి బుజ్జ
గించి కౌఁగిటఁ జేనని కోర్కెలుం దలిర్పఁ
గామశాస్త్రోక్తనియతి నక్కంజముఖిని
రతులఁ గరఁగించి సుఖలీలఁ గ్రాలుచుండె. 115

వ. అట్లు నవోఢాసంగమసౌఖ్యానుభవలీలావైభవంబునం జెలంగుచుఁ, గొన్ని వాసరంబు లచటనుండి, యంతట నొక్కనాఁడు యథాస్థానంబునకు వేంచేయ నుద్యోగించి, మహాదేవుండు శంఖదేవున కత్తెఱం గెఱింగించిన నతం డిట్లని విన్నవించె.

క. దేవా నాకుల మెల్లను, బావనమై వెలసె భక్తపాలన విద్యా
ప్రావీణ్యం బేర్పడఁగా, నీ విచ్చటి కరుగుదెంచి నిలుచుటకతనన్.

గీ. దేవ మాయింట నెప్పుడు నీవు నిలిచి, యుండవలె ననుకోర్కె లోనుండు నాకు
వెఱతు నివ్మాట మీతోడ విన్నవింప, నింక మీచిత్త మెట్టిదో యెఱుఁగ నేర. 118

క. మా కిట నీ వల్లుఁడవై, ప్రాపికటగతి నిలిచియున్న భాగ్యంబునకున్
లోకు లెఱుంగఁగ నన్నుం, జేకొని ధన్యునిగఁ జేయు శీతకరమకుటా. 119

ఆ. అనిన మెచ్చి శంభుఁ డటులే నిదిక్కుజ, లాపహారలింగరూపు నగుచు
నీగృహమున నుండు నిశ్చలభక్తితో, నన్ను గొలుచుచుండు నయవిచార. 120

వ. అని యతండు గోరినట్లనె కృపఁజేసి మన్నించి యతని నచ్చట నుండ నియమించి
మహోత్సాహంబున. 121

గీ. అభవుఁ డప్పుడు దివ్యదుందుభులు మొఱయఁ
బ్రమథవరులును దివిజులు బలసికొలువ
గంగతోఁగూడి వృషరాజగమనుఁ డగుచు
లీల వేంచేసెఁ గైలాసశైలమునకు. 122

ఉ. అంతకమున్న నారదమహామునివర్యుఁడు వెండికొండ కే
కాంతముగాఁగ నేఁగి గిరికన్యక గన్గొని యంబ శూలి దా
నంతసమొప్ప గంగ యనుజాలరికన్నియఁ బెండ్లియాడి నీ
చెంతకు వచ్చుచుండె నిదె చెప్పితి నీకు సవిస్తరంబుగన్. 123

క. అని దివిజమునివరేణ్యుఁడు, వినిపించి యథేచ్ఛ జనిన విస్మయ మొదవన్
మనమున హిమవద్భూధర, తనయ దిగుల్ వూని తద్దఁ దలఁకుచు నుండెన్. 124

సీ. అంతట శంకరుఁ డఖిలామరుల యథాస్థానంబులకుఁ బంచి సరభసముగ
గౌరికి వెలిచి యాగంగను జడలలో నిడుకొని నగరున కేఁగుటయును
గారకారతోడ నక్కుధరేంద్రనందన తలంపులు బంధించి వల మెలర్ప
మీనాంకదమనుని లోనికి రాకుండ నతికఠినోక్తుల నాడుచున్న
గీ. మదిఁ గలంగి పురారి యమ్మధురవాణి, కిట్టు లని పల్కె నహహా నీ కిట్టికినుక
యేల నామీఁదఁ బొడమె నే నేమితప్పు, చేసితి వచింపఁగదవె నా చెంత నిపుడు.
క. భక్తపరాధీనుఁడ నే, భక్తుల నరయంగఁ గోరి ప్రతిదివసము నా
సక్తిని దిరుగుచు నుండుదు, వ్యక్తావ్యక్తుండ నగుదు వనజాతముఖీ. 126
వ. కావున నాకుం దప్పుగా విచారించి కవాటబంధనం బొనరించు టుచితంబె
యనిన నతనికి భవాని యిట్లనియె. 127
గీ. ఎచటి కేగితి విందాఁక నెచట నుంటి, వెవ్వఁడవు నీవు నీ తెఱం గెఱుంగఁ
గ్రొత్త పెండిలికొడుకులాగునఁ గదిలింది, సొగసు కైకొని యున్నావు చూడ నిపుడు
గీ. తిరిరి కామాంధకారివై తిరుగుప్రొద్దు, నేమి నీ జాడ యింతయు నెఱుఁగరాదు
తెలియఁజెప్పు మటన్న నద్దేవితోడ, సింధురేఖాశిఖామణి యిట్టులనియె. 129
క. పర్వేందువదన విను మే, సర్వజ్ఞుఁడ నహహ మేలు సర్వజ్ఞునిపై
నుర్విని జను లెవ్వారున, ఖర్వమతిం దలఁగి పోయుగద పరికింపన్. 130
గీ. నీలకంఠుండ నే హరినీలవేణి, నీ చెలిమిఁ గోరుకొని వచ్చి నిలిచినాఁడ
నౌర మే ల్నీలకంఠుఁడ వైతి వేని, కేకలిడఁ గొంచు వేగంబె గిరికిఁ జనుము. 131
క. శ్రీడాకిరాతుఁడను నేఁ, జేడియ యటులైన నీవు జింకలు పులులుం
గ్రోడంబులు గలయడవికిఁ, బోడిమితో వేఁటలాడఁ బొమ్మా నెమ్మిన్. 132
సీ. అబల నేఁ బశుపతి నహహా నీ వటైన వాలమందకు నంకె లడరఁ జనుము
స్థాణుఁడ నేను గంజాతాక్షి యబ్బబ్బ మోడు మాటాడుట చూడ మెందుఁ
బురసంహరుఁడ నేను బోలతి నీ వటైన మావీట నుండక మరలి పొమ్ము
పన్నగధరుఁడను బడఁతి నే నటైనఁ బడిగె లెత్తుచు నూళ్లఁ బడి తిరుగుము
గీ. భూతనాథుఁడ నేను బూఁబోఁడి యట్టు, లేని నలప్రేతభూముల కేగు మిపుడె
కుటిలకుంతల నే మహానటుఁడ నట్టు, లైనఁ బ్రభువుల కడ కేఁగి యాడు మెలమి.
క. చిగురాకుఁబోఁడి విను మే, నగవాసుఁడ నట్టులాదవిన్ రెక్కలతో
గగనమున కెగసి చెట్లకు, జగతిస్థితి నిలువఁబోక చనుమా వేగన్. 134
గీ. విను విరూపాక్షుఁ డను నేను వనజవదన, యహహ బుధులు విరూపాక్షుఁ డైనవానిఁ
జూడరాదని తఱుమఁగ నాడుచుండ్రు, తొలఁగి వెంచేయు మిఁకఁ బెక్కుపలుకులేల.

గీ. అనుమఁ దానాడు మాటలకుఁ గతనూజ, పొసఁగఁ గల్పించి యుత్తరం బొసఁగుటయును
దలఁచి యాపూర్వనిహోగభామముఖికిఁ, గాలకంఠుండు నమ్మిక గా వచించె. 136

గీ. తెలిన నే నేమి పాపంబు సేయఁగ నవు, వట్టికప్పులు నామీఁదఁ గట్టి యిట్లు
గలఁక నొందింప నేల యాగ్రహము మాని, వినుము నామాట యొక్కటి వీనులలర.

సీ. వనఁబోఁడి నామాట నమ్మకుంటి కి పేనిఁ జెవకి బెబ్బులివాఁతఁ జెయ్యిడియెద
గట్టిగాఁ బెనుబాముఁ బట్టి యాడించెద విషమైన మ్రింగెద వెఱపు లేక
కొండుగక వడిఁ బెద్ద గుడి పొచ్చి నిలిచెద నవవీల గోపదం బాటుకొనెద
నంకిలి లేకుండ నగ్గి ధరించెదఁ బట్టుగా ద్విజరాజు ముట్టుకొనెద

గీ మఱియు నేబాసయైన నేనుమునఁ జేతుఁ, గాన నింక నిశలంపులో మాని మాని
శిరోమణి నన్ను మన్నింపు మిప్పు, డెలమితోఁ దుఃఖఁ గదియించి యేలుకొనుము.

గీ. అనిన నంబిక యొక్కింత యాత్మ నలరి, యారి నిక్కిట్టి బాసలు నచ్చివచ్చుఁ
బలుకు లేటికి రమ్మని తలుపు దీసి, పిలుమటయు నేఁగి యుతఁ డొద్ద నిలుమటయును.

గీ. ఆతనిసంభోగచిహ్నంబు లరసి చూచి, పార్వతీదేవి యిట్లనిపల్కె- సహహా
యిప్పుడే నేమిపాపంబు సేయఁగనంటి, వెవటి పీదిన్నెలో నాకు సెయఁగఁ జెప్పుము.

క. పసుపును గుంకుమగంధము, నసనంబుల నిగుమేన నట్టునదిలి యే
బిసరుహాముఖి యంటించెనొ, కసరక నాతోడ నిపుడు గట్టిగఁ జెపుమా. 141

వ. అనిన భవుం డిట్లనియె. 142

క. వినుమా మానిని జనులందఱు, వెనుకయ్యను బూజసేయు వేస నాతఁడు నన్
జెనఁగి కవుంగిటఁ బొదవిన, దనువున నవి యంటుకొనియెఁ దప్పే నాకున్.

గీ. కాలకంధర నీమోవిగంటు లేమి, కారణంబునఁ బొదవె నా గౌరి వినుము
మరునితోడ సెదిర్చి సంగర మొనర్చు, తఱిని గోపించి కీరంబు గఱచెఁ జుమ్ము.

క. హాటకగిరిధర నీమెయిఁ, గాటుక యంటిన దదేమి కారణ మబలా
శాటుక కాదికలత్తుక, గాటపుగరళప్రభావికాసము సుమ్మీ.

క. మే లెంతటి సెఱజాణవొ, బాలిగ దత్తురములాడి వంచించెదవో
బాలేందుజూట నీమెయిఁ, బూ లంటుకయున్న వేల పొంకక చెపుమా. 146

గీ. భామ విను మున్న శ్వేతుఁ డన్భక్తవరుఁడు, వెలవెలంగికిఁ బూల్గాంచువెడలునెడల
గొన్ని మహిమీఁద వ్రాలినఁ గోరి వాఁడు, నాకు నర్పింప నవి యంటి నాటుకొనియె.

క. పన్నగరాజాంగద నీ, కన్నుల కెఱుపేలగలిగె గౌరీభర్తల్
నిన్నర్ధరాత్రివఱకు, నన్ను జ్ఞాగరణ మునిచినం బొసఁగె నిటుల్. 148

గీ. అనుచు నిరువురు నిటు భాషింపుచుండ, నీలకంఠుండు మోహంబు నిలుపలేక

సర్వమంగళాచరణకంజములమీఁద, వ్రాలెన న్నుద్ధరింపవే వనిత యనుచు 149

క. ప్రాలినఁ గనుఁగొని గిరిసుత, మే లహహా జాణ వగుదు మెచ్చితి నిన్నున్
లే లె మ్మనుచుఁ గవుంగిటఁ, గీలించి విభు నసమనోజకేళిం దేర్చెన్. 150

వ. ఆట్లుభయులు హార్యోదయు లన్యోన్యానురాగంబు లినుమడింప నఖండమహావైభవంబు
నఁ బ్రమోదింపుచుండి యొక్కనాఁడు. 151

క. వేడుక మొప్పఁగ నెత్తిం, బాడుచు నున్నంత గిరిజ పాటలు లోనై
యాడి శివుఁ డూరకుండినఁ, గ్రీడాపాదమున గౌరి కిలకిల నవ్వెన్. 152

వ. అప్పు డమ్మహాదేవియౌద్ధత్యంబు సహింపలేక శివజటాగ్రంబున గంగ తొంగి
చూచిన దానిఁ గనుంగొని భవాని శంకరుని మొగంబు చూచి యిట్లనియె. 153

గీ. ఏమి పాపంబొ కీడు నే నెఱుఁగనట్టి, సహహా వికటజడలలోన నడఁగి తొంగి
తొంగి చూచుచు నున్న దీనూత్రసతియొ, దానిచందంబు తెలుపుమా తడయ కిపుడు.

క. మును దారుకావనంబున, ముని దారల భ్రమలఁ బెట్టి మోహింపఁగఁ జే
సిన మేటివన్నెకాఁడవు, నినుఁ జెప్పఁగ నేల యింక నేఁడు వృషాంకా. 155

క. భిల్లాంగనారాజకుమారిని, యిల్లాలి కడిఁదిసహోదరుల నింపొందినయా
చెల్లెంబుగ గామించిన, బల్లిదుఁడవు నిహారంగు పలుకం దరమే. 156

గీ. సురలు నసురులు నమృతంబు సరుదుకొనఁగ, లేక పోఁగాఁడు చోఁ జక్రిలీల నొక్క
నెలఁత యై పంచి యిడుచున్న విధ దాని, వెంటఁబడి పర్వెత్తవె వేడబమున. 157

వ. అని మఱియు నిట్లనియె. 158

ఉ. అక్కట శివు నన్నిటుల నాగడిఁ బెట్టి కలంపఁ జామటల్
నిక్కముగా మదిం దెలియనేరక యూరక మోసపోతి నిం
కెక్కడిసత్యశౌచములు నసులంబు వెలందిఁ దెచ్చిపెట్టి
డక్కగ నెత్తిఁ బెట్టుకొని టక్కులు వల్కెద వేమి చెప్పగన్. 159

గీ. తివిరి నామీఁద నొక్కతె దెచ్చి యిపుడు, లేదు లేదని బొంకుపల్కెద వయారి
దానిఁ గ్రిందికి దించి నాదటేని సల్పి, మాటలాడించుమా యింక మఱుగు లేల. 160

క. తగులమి యొకచోఁ జక్కెరి, వగ లొకచోఁ బెరయఁ జెలులు వంచింతురు గ
ట్టిగ నెట్టిబాసచేసిన, మగవారిని నమ్మరాదు మాట లిఁకేలా. 161

వ. అని పలుకుచున్న సమయంబున. 162

క. నిగిడెన్ శారశారలోఁడన్, మొగ మించుక చేవురింపఁ బోణిమి నబ్రం
బుగ నగధవనునిగడిఁ గొప్ప, సిగలోపలనుండి గంగ చివ్వున నతికన్. 163

వ. అప్పుడు భవాని దానిం గనుంగొని యిట్లనియె. 164

క. ఎక్కడిదానవె నీ విటు, లక్కజముగ నాహ్వాదీశునౌదలపైఁ బెం
పెక్కఁగ వసించి యిప్పుడు, చిక్కిన నుఱికితివి బుద్ధి సెప్పెదఁ జామ్మీ. 165

క. నీ వెక్కడ నే నెక్కడ, భావజహరుఁ డేచట నోసి పరఁగంగ నిఁకన్
గావర ముడిగి తటాలున, నేవేగ మదాలయంబు వెలువడి పొమ్మా. 166

క. పోకుంటివేని నిన్నుఁ గ, రాకొనులవంటిప్రమథరాజోత్తములన్
దీకొలిపి ప్రోలు వెడలఁగ, నూకింతుఁ జుమీ చలంబు నూలుకొనంగన్. 167

వ. అనినం బార్వతీ దేవికి భాగీరథి యిట్లనియె. 168

గీ. అక్కరో యిట్టిమాటల నాడనేల, నీవు శంభునిఁ గోరి మున్నే విధమున
వచ్చి చేకొనియున్నావో వారెముగను, నేను నటువలె వచ్చినదానఁ జువ్వె. 169

క. చిగురాకుఁబోఁడ్లకెల్లను, మగఁ డేమారగను మేటిమక్కువతోడన్
సగమేని నిల్పికొన్నను, నిగలో నిడుకొన్నఁ జెల్లుఁగదమ్మా. 170

వ. అనిన భవాని దాని కిట్లనియె. 171

క. మేలవాహా యెంతటిగ, య్యాళివె చేరినటులుండ కఱచెదవు కడుం
గూళికి వచ్చినయాతఁడు, పాలికిఁ బట్టినక్రియ న్విపర్యాసముగన్. 172

ఆ. అడుగునిలుపనీక నడికొట్టుమాపుము, నింగిముట్టి మిగులఁ బొంగదేమి
గట్టివాతనంబు గనఁబడనోనె నీ, నిలువు నిరుగాను నిచురాల. 178

వ. అనిన గంగ యిట్లనియె. 174

ఆ. పెద్దదాన ననుచుఁ బెళపెళ నార్చెదు, జగమెల్ల మ్రింగఁజాలినట్టి
సత్తిరూపు పూని జడిపింపవచ్చెదు, కినుక నిగుడ నీవు గిరితనూజ. 175

వ. అనిన హైమవతి యిట్లనియె. 176

గీ. నిచ్చనిచ్చలుఁ బంకంబు నివ్వటిల్లఁ, గోరి మితిలేనిజలచరకోట్లలోన
నడచుకొనియుండు చెనటు నయారె నీవు, నన్ను నెదిరింప నెట్టిదానవె తుటారి. 177

ఆ. వక్రగతులచేత వాలెంబుఁ బెక్కుత్రో, వల వెలుంగుచుండి కలఁక నిగుడఁ
దూఱి మొరసెదేమి దుష్కీర్తి బొడవి నీ, బ్రతుకు బైలుగాను పలువదాన. 178

క. అనిన జాహ్నవి గిరిసుతఁ, గనుఁగొని యిట్లనియె నీవు ఘనురాలవె మేల్
మును చండికవై యొకకో, ఱనుపోతును జంపి దానిహితమతిఁ గొనవే. 179

సీ. సకియ యూరూర దేశదేశములఁ బెద్ద, సత్త్వప నిల్చి కూళ్లును కోళములును
గొల్లి గొరియలు గుగ్గిళ్లు కుడుము లట్లు, దనివిసన మెక్కుకడుపుబద్దరివి గదవె.

వ. అనిన నంబిక యిట్లనియె. 181

గీ. ఓసి గయ్యాళి నీ కింతరోస మేల, చెడుగుజాలారివానింటఁ జొడమి బిట్టు
చేఁప జెల్లలు దిని మేను చెందకున్న, పరికెతవు నీవు నాతోడ సరియె చెపుమ.

వ. అనిన భాగీరథి యిట్లనియె. 183

గీ. అప్పరో యింక నిగుట్టు చెప్ప నేల, కల్లు గంగాయి నంజును నెల్లప్రొద్దు
జాళిగాఁ దిను కడజాతివానియింటఁ, బుట్టితివొ లేదొ చెప్పుమా గట్టిగాను. 184

వ. అని యిత్తెఱంగున నిరువురు వాదింపుచున్న సమయంబునఁ గాత్యాయనీదేవి మహా
దేవుని మొగంబు సూచి యిట్లనియె. 185

గీ. అకట మామీఁద నీవిప్పుడొక తెఁ దెచ్చి, వాద మొదవించి యెఱుఁగనివానిఁ బోలెఁ
జూచుచున్నాఁడ వింక నీచొప్పు దెలిసె, నఁచుఁ గోపించి చనుచున్న నళికి మారుఁడు.

గీ. వనితపదపద్మములమీఁద వ్రాలి నేను, దప్పు సేసితి లోఁగొమ్ము దయ దలిర్ప
నిందుముఖి యింక నెలఁతుక లెందరున్న, నీవు పట్టంపుదేవివి గావె చెపుమ. 187

వ. అని బుజ్జగించి గాఢాలింగనంబు గావించి గంగ చేత భవానికి మ్రొక్కించి
వారిద్దఱిం గనుంగొని యిట్లనియె. 188

ఆ. ఒక్కచోటఁ బుట్టి యొక్కనిఁ జెంది మీ, లోన మీకు వైరమూని యిట్లు
పోరొనర్పనేల పొలఁతుకలార మీ, రొద్దిమిఁ గూడియుండుఁ డింక. 189

క. అని నగసుత నర్ధాంగం, బున జాహ్నవి నుత్తమాంగమున నిడి కమలా
సనముఖ్యులు గొలువఁగ శివుఁ, డనయము దవనిధవి జగము లేలుచు నుండెన్. 190

సీ. గడితంపుమువ్వన్నెకడిఁదిమెప్పటియును బసమీఁబు బంగారుపట్టుచేల
రుచిరాఖినవచా రురుద్రాక్షమాలికల్ మరువైనపాఁరుముంజిముత్తెసరులు
భువనాభిరామవిభూతిశృంగరాగంబు పారకాశ్మీరపటీరచర్చ
భూరిశోభాకీర్ణ భుజగభూషణములు మణిమయతిపనీయమండనములు

గీ. పాండురారుణవర్ణవిభ్రాజమాన, గాత్రమును గల్గి శృంగారగరిమ నలరు
నర్ధనారీశ్వరేశ్వరుఁ డభవుఁ డిందు, నాలి భక్తాళి ననయంబు మనుచుచుండు.

గీ. అనుచు భీష్ముండు పాండుపుత్త్రునకు గంగ
. కథ యెఱింగింప నలరి యాపృథుబలుండు
నిటలలోచనుఁ దలఁపున నిలిపి మ్రొక్కి
యతితరామోదహృదయుఁడై యలరుచుండె. 192

గీ. శాలివాహనశకవర్ష సంఖ్యవసున, వాంగశశిసంజ్ఞ నలరుధాతాబ్దమునను
దగ రచించినయీకృతి ధరణియందు, నాసుధాకరతారార్క మగుచు నుండు.

క. వినుఁ డీకృతి ముప్పదియొక, దినములకుం జెప్పినాఁడ దేవునియానన్

జను లెన్నఁ గుక్కుటేశ్వరా, ఘనకరుణాదృష్టివలనఁ గవివరులారా. 194

క. ఈకథ చదివిన వ్రాసిన, బ్రాకటముగ విన్న జనుల పాపము లడఁగున్
జేకురు సకలసుఖంబులు, శ్రీకంఠుని కరుణ చేత నిక్కముగాఁగన్. 195

ఆశ్వాసాంతము.

చ. అరిబలదర్పశోషణ మహాహివిభూషణ సత్యభాషణా
సరసకృపానిరీక్షణ విచక్షణరక్షణ పుణ్యలక్షణా
హరిముఖనిర్జరావన విషాగ్నినిషేవన విశ్వభావనా
సరసిరుహాక్షసాయక లసత్ఫలదాయక లోకనాయకా. 196

తోటకవృత్తము.

శివశంకర శాశ్వత శిష్టరతా, భవభర్గ సమాశ్రిత భక్తహితా
దివిషజ్జనసేవిత ధీమహితా, వివిధాగమవందిత విశ్వనుతా. 197

మాలినీవృత్తము.

ప్రముదితమునిజాలా భక్తలోకానుపాలా
శమసమదవిభంగా చారుగంగోత్తమాంగా
ప్రమథగణసనాథా పార్వతీప్రాణనాథా
కుముదహితకలాపా కుక్కుటాధీశరూపా. 108

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర, ఘనయశోబంధుర, కౌండిన్యసగోత్ర పవిత్ర, కూచిమంచి గంగనామాత్యపుత్ర, సకలసంస్కృతాంధ్రలక్షణకళాకౌశలాభిరామ తిమ్మకవి సార్వభౌమ ప్రణీతంబైన శివలీలావిలాసంబను శృంగారరస ప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శివలీలావిలాసము సమాప్తము.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము — 1921.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | 0 | 2 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమప్రతి ... | 4 | 0 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము ... | 0 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు, లక్ష్మణకవికృతము | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు ... | 3 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము ... | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కఁగ ముద్రితము | 0 | 10 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితము మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నారము ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చివసీతారామస్వామిశాస్త్రి కృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుఁగలవు. ... | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము ... | 8 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము ... | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| హరవిలాసము ... | 0 | 12 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము ... | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవికృతము | ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| శివలీలావిలాసము, కూచిమంచి. తిమ్మకవికృతము | ... | 0 | 6 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | ... | 2 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| పారిజాతాపహరణము, మేలుప్రతి | ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| సహస్రకంఠరామాయణము | ... | 0 | 14 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, | .. | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక | ... | 8 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము | ... | 0 | 12 |
| అనంతుని ఛందస్సు, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | ... | 0 | 6 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు | ... | 1 | [illegible] |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.